అతని చర్యల నన్నింటినీ పరీక్షిస్తూ అప్పటివరకూ మూభావంగా కూర్చున్న చిరంజీవి, గణపతి పడుకోగానే మొదలెట్టాడు. "నీ ప్రవర్తన నాకేం నచ్చటంలేదురా గణపతీ..."

గణపతి విస్తుపోయాడు.

"అవును. నెలరోజుల్నుంచీ చూస్తూనే ఉన్నాను. అర్ధరాత్రీ, అపరాత్రీ వచ్చి పడుకోవటం, మాటా మంతీ లేకుండా తిరగటం, అన్నీ గమనిస్తూనే ఉన్నాను. ఇవ్వాళ నువ్వు చేసినపని ...ఛా... నీలాంటివాడలా తిరుగుతున్నాడన్నా నమ్మ శక్యంగాదు. అలాంటిది నా కళ్ళతో చూసే దౌర్భాగ్యం పట్టింది నాకు ... ఛీ ... యింత బ్రతుకూ బ్రతికి..."

"చిరంజీవీ" గణపతి ఆవేశంగా అరిచాడు. నేనేం అంత చెడ్డపని చెయ్యలేదు ... అనవసరంగా మాట జార వద్దు."

చిరంజీవి నిశ్చేష్టుడై పోయాడు.

గణపతి అన్నాడు మళ్ళీ, "పైగా నీకు నా ఉద్దేశాన్ని ఏనాడో చెప్పాను. ఇందులో తప్పేమీ లేదు. నే నేమీ పరువు తక్కువ పనులు చెయ్యటంలేదు."

చిరంజీవి కోపంగా అన్నాడు. "ఆదర్శం పేరుతో నీ చిత్తమొచ్చిన పనులు చేస్తానంటే నేను సహించలేను గణపతీ. నా కెంత జీవిత లక్ష్యాలు తెలియకపోయినా నువ్వు యివాళ చేసిన పనిని గాని, రేపు చేయబోయే పనిని గాని హర్షించలేను."

"ఇతరులు హర్షించరనీ, ఏదో అయిపోతారనీ నేను నా ప్రయత్నాన్ని వదులుకోలేను..."

"నేను అలాంటి మనుష్యుల్నే వదులుకోగలను..."

"చిరంజీవీ..." గణపతి నిర్వేరపోయి అన్నాడు.

"తల వంచుకుని చెప్పాడు చిరంజీవి. "నువ్వు నీ ప్రయత్నాన్ని విరమించుకోలేకపోతే మనకు పొత్తు కుదరదు. పండువంటి మన మైత్రిని కుళ్లబెట్టి నడిబజార్లో విసిరేసే వరకూ నేనూ చేతులు ముడుచుకు కూర్చోలేను..."

"అయితే సరే ... యింత దూరం వచ్చిన తర్వాత యింకెందుకు... రేపు మాపుల్లో జరిగేపని యీరోజే జరిగిపోవటం మంచిది. నే నిప్పుడే వెళ్ళిపోతాను..." గణపతి విసుగ్గా మంచం దిగాడు.

చిరంజీవి ఆశ్చర్యంగా అన్నాడు, "ఇప్పుడా... ?"

"అవును యిప్పుడే..."

"ఎక్కడికి... ?"

"ఎక్కడి కేమిటి. లోకంలో నీ అంత ఉదారులు ఇంకెంతోమంది ఉన్నారు..."

చిరంజీవి బాధపడ్డాడు. గణపతి వెళ్ళిపోవటానికి సిద్ధపడుతూంటే అతని మనస్సు తహతహలాడసాగింది. "గణపతీ..." అన్నాడు బొంగురుపోయిన కంఠంతో. అతని కళ్ళు అశ్రుపూరితాలైనాయి.

"గణపతీ...నామాట విని నీ ప్రయత్నం మానుకో. కావాలంటే మంచి సంబంధం చూసి నీకు పెళ్ళిచేసే బాధ్యత నాది."

"ఏం లేదు చిరంజీవి...ఇతరులకోసం నేను నా ఆశయాన్ని వదులుకోలేను."

"అయితే నన్నే వదులుకుంటావా?" చిరంజీవికి దుఃఖం కట్టలు తెంచుకుంది.

"ఆఁ..." మొండిగా అనేశాడు గణపతి.

గణపతి మొండిపట్టుకు వగవటం కన్నా మరేమీ చేయలేకపోయాడు చిరంజీవి.

మరో గంటకు—చీకటి—చిరంజీవి మిగిలారా గదిలో!

* * * *

అగ్నిసాక్షిగా జరుగవలసిన గణపతి పెళ్ళి రిజిస్ట్రారు సాక్షిగా జరిగిపోయింది.

ఆ ఆఫీసులో పనిచేసే గుమాస్తాలే పెళ్ళి పెద్దలై దంపతుల్ని దీవించారు.

పవిత్ర మాంగల్యబంధం మరోరూపు దాల్చి పూల దండగా మారింది.

మంత్రాలు దస్తావేజుగా రూపొందాయి.

గణపతి ఒక యింటి వాడైనాడు.

చిరంజీవిని ధిక్కరించి మాటమీద మాటఅని వచ్చేసినందుకు గణపతికి బాధగానే వుంది. కాని ఈ బాధనుమించిన తీయని బాధల్లో దాన్ని మర్చిపోగలిగాడు.

మణి అతనికి మధుర రసాలను చవి చూపుతూ, అతన్ని నందనవనాల్లో విహరింపచేయసాగింది. అతనిభావనా

స్వర్గానికి రూపాన్నిచ్చి, అతని ఆశయ సాధనకు పట్టు కొమ్మయి—మణి గణపతికి ఆరాధ్యదైవంగా మారింది. ఆమె సన్నిధిలో అతనొక పసివాడై క్రీడించసాగేడు. ఆ ఆట పాటల్లో రోజులు క్షణాలుగా దొర్లిపోతున్నై.

ఆ వేళ...

సరసాల మురిపాల తూగు టుయ్యాలలో తేలిపోతున్న గణపతి ఆనందమయ కేళికి అంతరాయాన్ని కలిగిస్తూ కవరొకటి యిచ్చిపోయాడు పోస్టుమన్.

చదవమని కవర్ని మణికిచ్చాడు గణపతి. ఆమె ఉత్తరం తీసి చదవసాగింది.

"ప్రియమైన మేష్టరుగారికి—

"ఓ ... మా సుజాతా ... ఏదీ...యిలాతే ..." అంటూ హుషారుగా లేచి మణి చేతిలో ఉత్తరం లాక్కొని గబగబ చదవసాగేడు.

తాను చదవబోయే ఉత్తరాన్ని గణపతి లాక్కొని చదవ సాగటంతో మణికి కోప మొచ్చింది.

జాబు చదువుతున్నకొద్దీ అతని కవళికలు మారి, మొహం విషణ్ణమైంది. నిరుత్సాహంతో మంచంమీద కూలబడిపోయాడు.

అతని మనస్సు కలతచెందింది. సుజాతను గురించిన ఆలోచనలు ముసురుకోసాగినై. ఆమె వ్రాసిన విషయాల వెనుక దాగిన ఘోరాలు అతనికళ్ళముందు నర్తించసాగినై.

కొండంతను గోరింతలుగా చెప్పినా, దాని యథార్థ పరిణామాన్ని ఊహించుకోతగినవాళ్లు కొందరుంటారు. గణపతి తత్వం అంతే. ఎదుటివారికి ఏమాత్రం కష్టంకలిగినా దాని లోతును గమనించటం అలవడిందతనికి.ఇప్పుడు సుజాత కూడా చెప్పీ చెప్పనట్లు కొన్ని బాధల్ని వెలువరించింది. ఆమె వ్రాత వెనుక దాగిన ప్రత్యక్షకథనాలు ఆమెకే తెలుసు. కాని, 'అవి యిలాఉండి ఉంటాయి' అని చెప్తున్నది తన మనస్సు.

ఉత్తరాన్ని మళ్ళీ చదువుకున్నాడు గణపతి.

"ప్రియమైన మేష్టరుగారికి—

"నమస్కారములు. నాన్నకు గారాబు పట్టిగా పుట్టి పెరిగిన నేను, మరొకరి దాసిగా యిక్కడకు వచ్చిన చాల రోజులకు మీకు ఉత్తరం వ్రాస్తున్నాను. ఈ ఆలస్యానికి కారణం మీ అడ్రస్ దొరక్కపోవడమే... మొన్న గోపాలం యిక్కడికి వచ్చినప్పుడు చెప్పాడు, మీరాఊళ్ళో ఉద్యోగం చేస్తున్నారని.

"ఆ రోజున మీరు మూగ కళ్ళతో నాకు వీడ్కోలు చెప్తున్నప్పుడు, పెళ్ళికూతురుగా మారిన నేను కళ్ళు ఒప్ప జెప్పి చూడటం కన్నా మరేమీ చేయలేకపోయాను. ఉదర పోషణకోసం మా ఊరికి వచ్చి, నలుగురికి ఉపకారం చేయాలనే సదాశయానికి ప్రతిఫలంగా అపకారాన్ని పొందిన మిమ్మల్ని తలచుకుని నేనెంతగానో బాధపడ్డాను.పోనీలెండి. ఏదెలా ఉన్నా మీరా విషవలయంలోనుంచి త్వరలో బైట

పడినందుకు 'క్రీడలో మేల'నిపించింది నాకుమాత్రం. సరే... గతించినదాన్ని పునరావృతిచేసి మీ మనసుకు కష్టం కలిగించట మెందుకు?___

ఇక నా సంగతి. మీకు తెలుసుగా మాష్టారూ... నాదంతా లక్క స్వభావమని. వేడిచేస్తే ఉక్కిరిబిక్కిరై చెప్పినట్లు వంగుతుంది. మా మామగారు ఈ ఊళ్లోకల్లా పెద్ద రైతు. రోజూ పది పదిహేనుమంది దాకా రాజకీయ వేత్తలు వీరికోసం వస్తూ పోతూ ఉంటారు. మా నాన్న కూడా వాళ్ళల్లో ఒకడైనాడు. వచ్చే యేడు 'ఎమ్.ఎల్.ఏ' పదవి ఆయనదే నని నిర్ణయమైందట. ఆ సంగతి నాకు చెప్పి "ఇదంతా నీ అదృష్టం తల్లీ" అంటూ మురిసిపోయాడు.

మా అత్తగారు చాలా మంచిది. కొడుకంటే ఆవిడకు పంచప్రాణాలు. వారికి కావలసిన సకలావసరాలు ఆమె స్వయంగా తీరుస్తుంది. తల్లిని పిల్లిలా ఆడించి కావలసింది ఒడుక్కుపోగల నేర్పు మావారికిఉందిలెండి వారు ఉద్యోగం ఏమీ చేయటం లేదు. కాని ఉద్యోగస్థులకుండే కనీసపు తీరిక కూడా వారికుండదు. దానికి ముఖ్యకారణం వారివ్యాపకాలే. ఇంట్లో భార్యకన్నా కర్తవ్య నిర్వహణ ముఖ్యం గదా మాష్టారూ?... అందుకే వారు నాకన్నా, నా సౌఖ్యంకన్నా కూడా తను 'విధి'కి ప్రత్యేక ప్రాముఖ్యాన్నిస్తారు. దాని తర్వాతే మిగిలిన విషయాలు. ఆ విధి నిర్వహణలో ఎంత 'సొమ్ము' పోయినా బాధపడరు.

"అదీ నా పరిస్థితి. ఇలాంటి సుఖాన్నీ, ఆనందాన్నీ అనుభవించి విసుగుపుడుతున్నది... మాస్టారూ?...

"అందుకే మా అత్తగారు అంటూ ఉంటారు. "నీకు వేదాంతం తలకెక్కుతున్నదే కోడలా" అని.

"అవును మరి. అన్ని ఆనందాలకు చరమావస్థ అదే గదా... నిజమేనా మేస్టారూ... ఏమిటో లెండి శ్రోత్రుఘారం తెలిసంతా ఉపయోగిస్తున్నదే సుజాత అనుకుంటున్నారా? అనుకోండి... నాకేం ఫర్వాలేదు...

"గోపాలం మొన్నమధ్య యిక్కడికి కొచ్చినప్పుడు భయపడుతూ అన్నాడు. "అమ్మాయిగారూ... మిమ్మల్ని చూస్తుంటే నాకేదో భయంగా ఉందండి..." అంటూ.

"పిచ్చివాడు! కాక మరేమిటి? ఆనందంతో త్రుళ్లిపడుతున్న నన్ను చూస్తే భయమేమిటి?_ అదే చెప్పి పంపాను, "నాకీ సంసార సౌఖ్యంమీద యింకా పూర్తిగా విరక్తి పుట్ట లేదు లేవయ్యా గోపాలం... అంత భయపడకు" అని.

"అది సరే మేష్టారూ... అన్నట్టు పెళ్ళి విందెప్పుడు చేస్తారు మా కందరికీ... ఆ సంతోషాన్ని నాకిస్తారో—లేక ఆ... ఎక్కడి సుజాత, అని వదిలేస్తారో?—

"ఉంటాను మాష్టారూ... ...ఇప్పటికే మీకు తల నొప్పి పుట్టించి ఉంటుంది నారాత... సెలవు—

సుజాత...

కంఠంలో మ్రింగుడుపడని గరళాన్ని దాచుకున్న ఈశ్వరుడి నెత్తినే ఉన్నాడు, చల్లని వెన్నెలలు కురిపించే చంద్రుడు.

బడబాగ్నులతో హృదయాన్ని దహింపజేసుకుంటూ చిరునవ్వు చిలకరించగలిగే శక్తి అందరికీ వుండదు.

తెలిపీ, తెలపనట్లు తన స్థితిని వివరించిన సుజాత తెలివితేటలకు ఆశ్చర్యపోయాడు గణపతి... "అవును. సంస్కారం, జ్ఞానం కేవలం చదువువల్ల కలిగేవి కావు." అనుకున్నాడు.

"ఎవరండీ ఈమె?"

గణపతి ఆలోచనల్ని ఆపి మణిని చూశాడు.

ఆమె ఉత్తరాన్ని చదివినట్లుంది. మడిచి కవర్లో పెడుతూ అడిగింది.

మణి ప్రశ్నలో ఈర్ష్యాసూయలు ధ్వనించినై గణపతికి. తీక్షణంగా ఆమెను చూస్తూ అన్నాడు, "నా కాప్తురాలు" అని.

"ఆహాఁ... అది తెలుస్తూనే ఉంది." అని మూతి విరిచి అక్కణ్ణుంచి లేచి వెళ్ళింది మణి.

'అసూయకు పర్యాయపదం—స్త్రీ' అనిపించింది గణపతికి. సన్నగా నవ్వుకుని భార్యను పిలిచాడు. మణి పలక్కుండా వంటగదిలో చాప పఱుచుకుని పడుకుంది.

గణపతి ఆలోచన జాబులోని విషయాల మీదికి పోయింది. 'తనను చూసి అత్తగారు వేదాంతం తలకెక్కుతున్నదనీ—గోపాలం తనకేదో భయంగా ఉందనీ, అన్నాడని వ్రాసింది సుజాత... అంటే?—ప్రశ్నార్థకం వెక్కిరించింది గణపతిని... మరో విషయం, "ఈ సంసార సౌఖ్యం

మీాద పూర్తిగా విరక్తి పుట్టలేదు.' అని వ్రాయటంలో సుజాత ఆంతర్యం ఏవిటి?—పూర్తిగా విరక్తి పుడితే?—

గణపతిలో హృదయచలనం అధికమైంది.మనస్సంతా అల్లకల్లోలమైంది. సుజాత ఏ అఘాయిత్యానికన్నా తలపడు తుందా?—అతని కేదో భీతి కలిగింది. సుజాతమీాద అతని కున్న అభిమానం, ఆప్యాయతా పొంగి, ఆమెను గురించి చెడుగా ఆలోచించుకునేసరికి దుఃఖం ముంచుకొచ్చింది.ఆమె అంటే అవ్యక్తమైన అనురాగం నిండిన అతని మనస్సుకు, సోదరీ ప్రేమను చవిచూపిన సుజాతకు ఈ కష్టా లేవిటని వ్యథ చెందింది గణపతి హృదయం.

'వ్యధిత హృదయాలకు శాంతి నిచ్చే శక్తి ఒక్క నిద్రాదేవతకే ఉంది...'

* * *

నెలరోజుల తర్వాత ఒకరోజు—

సాయంత్రం ఆరుగంట లైంది—

గణపతి ఆఫీసునుంచి కాళ్ళీడ్చుకుంటూ యింటిదారి పట్టాడు.

వ్యాపారం నష్టంలో నడుస్తున్నదని ఉద్యోగాన్నుంచీ తీసేసి, ఆనాటి వరకూ అతనికి రావలసిన జీతం ఇచ్చి పంపారు కంపెనీవాళ్ళు. భవిష్యత్తు కష్టాల మయంగా గోచ రించి, నిస్పృహ కలిగించింది గణపతికి.

'టీచర్ ఉద్యోగం వదిలేసి వచ్చినా చిరంజీవి సహా యంతో వెంటనే యీా ఉద్యోగం దొరికింది తనకు. ఇప్పు

డిపోయింది. చిరంజీవి లేడు — రేపనేది ఎలా గడుస్తుందో ననే దిగులుతో, మరో ఉద్యోగం ఎలా దొరుకుతుందనే బెంగతో నిండిపోయింది గణపతి హృదయం.

అనేక రకాలయిన ఆందోళనలతో యిల్లు చేరాడు. ఎదురుగా తాళం అతన్ని చూసి వెక్కిరించింది.

ఇంతలో ప్రక్కింటిపిల్లవాడు తాళంచెవి తెచ్చిచ్చాడు "మణమ్మగారు యిమ్మన్నారు, ఎటో వెళ్ళా" రంటూ.

"సరి... ఈవిడ చెప్పదూ ఏగో ఓ పాపింగు" అనుకుంటూ విసుగ్గా లోపలికి వెళ్ళి పడక్కుర్చీలో కూర్చోబోయాడు. అందులో ఉత్తరం... తీసి గబగబా చదివాడు.

"(శ్రీ)వారికి...

"నేను పతితను ... ప్రపంచానికి తెలిసిన యథార్థమిది. అయినా కోరి, నాకోసం పరితపించి నన్ను పెళ్ళిచేసుకున్నారు. నాకోసం గొప్ప త్యాగంచేసి ఆదర్శంగా నిలిచారు... కానీ...

"మీకూ నాలాగే పూర్వ చరిత్ర ఉన్నవారని తెలిసిన తర్వాత నాలో ఉన్న అసూయ కానీండి, బలహీనత కానీండి బయటపడింది. నాకీ జీవితంకన్నా గత జీవితమే హాయీ, మేలనిపించింది. ఆలోచించి, ఆలోచించి యీ నిశ్చయాని కొచ్చాను... అందుకనే మీనుంచి తప్పుకుంటున్నాను. నన్నొక నీచురాలిగా తలచి మరచిపొండి...

"మీ పూర్వ ప్రేయసి కాబోలు మళ్ళీ ఉత్తరం వ్రాసింది. టేబుల్ మీద ఉంది...

మీ మణి...

"మణి ! ..." గణపతి కుప్పలా కూలిపోయాడు. ఏదో విషవాగురంలో తగుల్కొని తల్లడిల్లేవాడిలా అయిపోయాడు... కోకిలకంఠం లేకమైన వికటాట్టహాసాలు చేస్తూ అతని కళ్ళముందు నర్తించినై. అసంకల్పంగా టేబులుమీద కవరును తీశాయి చేతులు... ఉత్తరాన్ని చించి పుచ్చుకున్నాయి... కళ్ళు అక్షరాల్ని చూశాయి... మనస్సు చదువుకుంది...

"పంతులుగారూ... సుజాతమ్మగారు వాళ్ళ ఊరి పక్క ఏటిలో పడి చచ్చిపోయారు... గోపాలం..."

"సుజీ..." గణపతి తల పడక్కుర్చీ ఫ్రేముకు కొట్టుకుని దిమ్మెక్కిపోయింది. గణపతి పిచ్చివాడే అయాడు.

విధి చేతి కీలుబొమ్మ నట్టొకటి రాలిపోయింది.

ప్రపంచంలో వెలుగు నిండుకుంది—

జగతి చీకటిని నింపుకుంది—

ప్రకృతి పురుషుల వింత వింత సల్లాపాల్ని విని గంభీరంగా అపహసించాడు సాగరుడు—



# నీలి నీడలు

మరోకసారి టెలిగ్రామును చదువుకొని పడక కుర్చీలో మేను వాల్చాడు డాక్టరు క్రాంతి కుమార్.

అరుణ రఘును తీసుకొని తానిక్కడకు వస్తున్నట్టు పంపిన వర్తమానాన్ని మోసుకొచ్చిన టెలిగ్రామది.

టెలిగ్రాం మోసుకు వచ్చిన సమాచారం కొద్దిదైనా దాన్ని చదివిన క్రాంతి కుమార్ మనసు గత జీవితపు సుదూర ప్రాంతాలకు విసిరివేయబడింది. ఎన్నో సంగతులు — ఎప్పటివో — ఒద్దన్నకొద్దీ మనసులో ప్రవేశించి 'మేమూ ఒకప్పుడు నీకెంతో సన్నిహితులైన వాళ్ళం. ఆ రోజుల్లో మేము లేకుండా నీవు లేవు. అలాంటిది ఇప్పుడు మేమై మేము వస్తామన్నా ఒద్దనిపిస్తోందా' అని ప్రశ్నిస్తున్నాయి.

నిజమే. కాని ప్రస్తుత పరిస్థితులు వేరు. కాలం ఎంత మహత్తరమైందో అంత మధురమైంది కూడాను. ప్రస్తుతానికి

ఏ విధంగానూ ఉపయోగపడని పాత ఆలోచనల్ని మరుగు పరుస్తుంది. అరుణ, రఘు ఒకప్పుడు తనకెంత సన్నిహితులో! వారితో ఎన్ని సంవత్సరాల కాలం ఎంత ఆనందంగా గడచిందో కాని విధి తమని వేరుచేసింది. దిక్కుకొకర్నిగా విసిరి వేసింది. ఆ మార్పును, భౌతికంగా వారి మధ్య ఏర్పడ్డ దూరాన్ని కాలం క్రమేణా; భూతద్దం వస్తువు పరిమాణాన్ని పెంచినట్లుగా పెంచి చివరికి గుర్తుపట్టలేనంతగా మార్చింది. అలా మార్పు రావటం అవసరమైంది కూడాను. కాని ఇప్పుడు అరుణ, రఘు ఇక్కడికి వస్తున్నారంటే ఇక వారిని గురించిన వెనుకటి సంఘటనలు జ్ఞాపకం రాక మానాయా? తను వాటిని గురించి ఆలోచించటం మానగలడా?.

పది సంవత్సరాల తర్వాత నిన్నగాక మొన్న అరుణ ఒక్కర్తే స్టేషన్లో కనిపిస్తే ఎంత ఆశ్చర్యపోయాడో! ఇప్పుడు అరుణ రఘును నేరుగా తనవద్దకే తీసుకు వస్తోందని తెలుసుకున్నా క్రాంతి కుమార్ అంతకు రెట్టింపుగా ఆశ్చర్యపోయాడు. ఇలా తీసుకు వస్తానని మొన్న అరుణ మాట మాత్రమైనా అనలేదు.

మొన్న సాయంత్రం...

అరుణ స్టేషన్లో కనిపించింది. ఎంతో మారిపోయింది. నలుగురు బిడ్డల తల్లి. భర్తకు అనంతపురంలో ఉద్యోగం ఇంజనీరు. ఫస్టుక్లాసులో ప్రయాణం చేస్తున్న అరుణ ఏదో పనిమీద ప్లాట్‌ఫారంమీద తిరుగుతున్న క్రాంతికుమార్‌ను గుర్తుపట్టి పిల్చింది. ఆమె పిల్చింది తన్ను కాదేమో నను

కున్నాడు క్రాంతికుమార్ మొదట్లో. కాని ఆమె పేరుపెట్టి మళ్ళీ పిలవటంతో దగ్గరకు వెళ్ళాడు. అరుణ! ఎప్పటి అరుణ!! కాని ఈ అరుణ వేరు. ఈ అరుణ కళ్ళల్లో వింత వెలుగు గాని, చిలిపి చూపులు గాని, మాటల్లో చమత్కారం గాని మచ్చుకైనా కన్పడవు. మనిషికి తగ్గట్టు నిగూఢమైన చూపులు. తూచి వాడినట్లుండే బరువైన మాటల్లో హుందాతనాన్ని చాటుతోందిప్పుడు. 'ఔను మరి. ఇంజనీరుగారి భార్య!' అనుకున్నాడు క్రాంతికుమార్.

మాటా మంతీ లేకుండా నిల్చుని ఆలోచనా వీచికల్ని ప్రోవు చేసుకుంటున్న క్రాంతికుమార్‌ను చూచి 'అవునవున్లే, మేమెక్కడ గుర్తుంటాము, ఫారిన్ రిటర్న్డ్ డాక్టరుగారికి' అంది అరుణ.

అరుణ ఏ ఉద్దేశ్యంతో అన్నదో గాని ఆ మాటలు క్రాంతికుమార్‌కు బాధకలిగించాయి. తను ఏమీ మాట్లాడకుండా ఉండటాన్నే అరుణ అలా అన్నదనుకుని 'కులాసామేనా' అనగలిగాడు.

అరుణ అదోలా నవ్వింది. అది నవ్వో, నిట్టూర్పో అర్థం కాలేదు క్రాంతికుమార్‌కు.

తర్వాత సంభాషణ అనేక విషయాలపై దొర్లింది. అరుణ తన భర్తను గురించి, పిల్లల్ని గురించి, భర్త ఉద్యోగాన్ని గురించి చెప్పింది. ఆ మాటల్ని ఎంతో శ్రద్ధగా విన్నాడు క్రాంతికుమార్. విన్న మీదట అనిపించినదేమంటే 'అరుణ అదృష్టవంతురాలే, పెద్ద హోదాలో ఉన్న భర్త,

ఆశీముత్యాల్లాంటి పిల్లలు. సంసారం సుఖంగా సాగిపోవటానికి అంతకంటే కావలసిందేముంది?' అని అదే మాట పైకి అనేశాడు కూడా.

అరుణ కొన్ని క్షణాలు మౌనంగా వుండి, "ఔను, నేనెంతో సుఖంగా ఉన్నాను. నాకేం తక్కువ దిగులు, చింత తీరని కోరిక అంటూ లేనేలేవు." అంది ఎటో చూస్తూ. క్రాంతికుమార్ నివ్వెరపోయాడు. ఆ మాటలు అంటున్న అరుణ వైఖరి సహజంగా కన్పించలేదు అందులో వ్యంగ్య మేమైనా ఉందా? అరుణ జీవితం నిజంగా సుఖప్రదం కాలేదా? అనిపించింది. కాని ఆ విషయమై ఏమని అడుగుతాడు? అందుకని విషయం మారుస్తూ 'రఘు ఎక్కడ ఉంటున్నాడు? కులాసానా' అన్నాడు.

అరుణ నిట్టూరుస్తూ 'అన్నయ్య విషయం ఏమని చెప్పాలో అర్థం కావటంలేదు. నే చెప్పగల విషయం ఒక్కటే. అన్నయ్య కడుపులో కేన్సర్ చాలా ప్రమాదంగా ఉందని వైద్యగొచ్చింది. అందుకే వెళ్తున్నాను' అంది. క్రాంతికుమార్ దిగ్భ్రమ చెందాడు. ఏమీ మాట్లాడలేక పోయాడు. ఎప్పుడూ 'రోబస్టు'గా కనిపించే రఘుకు ఈ వయసులో కేన్సరేమిటి అనుకున్నాడు. ఇంతలో గార్డు విజిలు వేసి పచ్చజండాను విదిలించాడు. అరుణ వెళ్ళిపోయింది.

క్రాంతికుమార్ లేచి, సిగరెట్ ముట్టించి గట్టిగా పొగపీల్చి వదిలాడు. పొగ సుళ్లు తిరుగుతూ పై పైకి లేచి

వెళ్తోంది. చిన్నప్పుడు జీవిత మంటె 'గులాబీలు పరచిన బాట'లా అనిపించేది. కాని రాను రాను తన అభిప్రాయాన్ని తప్పనిసరిగా మార్చుకోవలసి వచ్చింది క్రాంతి కుమార్‌కు. ఎన్నెన్నో ఊహాసౌధాలు నిర్మించుకున్నాడు. కాని అన్నీ వమ్మయినై ఒకటి తప్ప. అది తను ఫారిన్ రిటర్న్డ డాక్టరు కావాలనే కోరిక.

అమ్మ అంటూండేది. 'నీవు తప్పకుండా డాక్టరు వౌతావురా' అని కాని పరిస్థితుల్ని చూస్తుంటే తనకు భయం వేసేది. మెడిసిన్ చదవటం మాటల్తో అయ్యేపని గాదు. వేలకు వేలు డబ్బును వెదజల్లాలి. అంత డబ్బు ఎక్కడినుంచి వస్తుంది! అమ్మ అతి కష్టంమీద కుటుంబాన్ని వెళ్ళదీస్తూ తనను చదివిస్తోంది. అంతా పోగా మిగిలిన ఒక ఎకరం పొలం రమ పెళ్ళి ఖర్చులకీ, కట్నం కానుకలకు గాను మిగిల్చింది.

రమ యస్సెల్సీ ప్యాసయింది. మామూలుగా పాసవటం గాకుండా స్కూలుకంతకూ ఫస్టుగా వచ్చింది. కాని ఏమిటి ప్రయోజనం ? కాలేజీకి పంపే అవకాశం ఏమాత్రమూ కన్పించలేదు. ఒక్కగాను ఒక్క చెల్లెల్ని ఇంకా చదివించాలనే అనుకున్నాడు క్రాంతికుమార్. తమ ఆర్థిక స్థితిగతులు అతనికి తెలియకపోలేదు. అయితే చదువు మీద వుండే ఆసక్తి, చెల్లెలిమీది ప్రేమ అలా అనిపించాయి అతనికి.

'అయినా, ఆడపిల్లలకు అంతకంటే చదువు ఎందుకురా క్రాంతీ ! ఇంతవరకూ చదివింది చాలు. ఇక పనీ పాటల్లో నేర్పు, వంటావార్పుల్లో చాకచక్యమూ, కుటుంబ

నిర్వహణలోని మెళకువలు తెలుసుకుంటే చాలు, తన జీవి తాన్ని, తన భర్త జీవితాన్ని నందనవనం చేసుకోవటానికి' అనేది రమ.

'అయితే అరుణ ఎందుకు చదువుతున్నట్టు' అనే వాడు క్రాంతికుమార్.

అరుణ, రమ సహాధ్యాయులు. వారిద్దరిదీ గాఢమైన స్నేహం. ఎప్పుడూ కలిసి తిరిగేవారు. ఒకళ్ళింటికి మరొకరు వెళ్తూ తరచు ఒకే చోట కాలం గడుపుతుండేవారు. ఏ పని చేయాలనుకున్నా ఇద్దరూ కలసి చేసేవాళ్ళు. అందువల్లనే స్కూల్లో వారిద్దర్నీ 'ద్వయం' అనేవారు. విశేషమేమంటే ఇద్దరూ తెలివైనవాళ్ళే. సమవుజ్జీలు. అందంలో ఎవరిది పైచేయి అని చూచిన వాళ్ళంతా తర్జన భర్జనలు చేసుకునే వారు. దాదాపు ఒకే ఈడు. అయితే ఎవరికైనా ఎక్కడో ఏదో లోపం ఉంటుందన్నట్లు వారి స్నేహంలో ఇతరులకు కన్పించేది మాత్రం ఒకే ఒక లోపం. అదే వారిద్దరి అంతస్థుల మధ్య వున్న తేడా.

'అరుణకేం నాయనా, లక్షాధికారి పుత్రిక. అవసర మున్నా, లేకపోయినా చదువుకోటానికి కావలసినంత అవ కాశం ఉంది. స్తోమత ఉంది. మనకది లేదు. అయినా మగ వాడివైనందుకు నీకు చదువు అవసరం. ఎన్ని కష్టాలొచ్చినా విఘ్నం రానీకుండా చదువు సాగించాలి. నీ కోర్సు పూర్తి అయింతర్వాత మంచి సంబంధం చూసి రమకి వివాహం చేస్తే—దానికి పది బియ్యేలు చెప్పించినంత. నా కంతకంటే

కావలసిందేముంది' అనేది అమ్మ. మరి, రమ మాతృవాక్య పరిపాలకురాలు.

రమ విషయం తల్చుకుంటే క్రాంతికుమార్‌కు రంపపు కోతలాంటి బాధ కలుగుతుంది. ఆమె భర్త బాగా చదువు కున్నవాడు. సంస్కారమున్నవాడు. బాగా సంపాదిస్తున్న వాడూను. అయితే ఏం? ఏ వ్యక్తికైతే మొట్ట మొదటగా మనసు ఇస్తుందో ఆ వ్యక్తి తన భర్త కానప్పుడు మగువ పొందే మనఃక్లేశాన్ని మించిన నరకం లేనేలేదంటారు. కాని స్త్రీ సహనశీలి. బడబానలాన్ని కూడ ఏమాత్రం బాధ కలుగకుండా తన కోమల హృదయంలో దాచుకునే శక్తి ఒక్క స్త్రీకే ఉంది. కాగా, రమ మరోమెట్టుపైనే ఉందని చెప్పాలి. గతాన్ని మర్చిపోయినా జీవితాన్ని ఉన్నంతలో సుఖమయం చేసి తన కుటుంబాన్ని తీర్చి దిద్దుకుంటోంది.

'కాని పురుషుని విషయం వేరు. ముఖ్యంగా నా విషయం' అనుకున్నాడు క్రాంతికుమార్.

అతనిలో బలహీనత గతాన్ని మర్చిపోయి క్రొత్త పరిస్థితుల కనుగుణంగా తనను తాను మల్చుకోలేక పోవటం. 'అసలు ఈ రెండు కుటుంబాల మధ్య స్నేహం ఎందుకు మొలకెత్తాలి? మొలకెత్తినా ఇలాంటి విషాద పరిణామా లకు ఎందుకు దారి తీయాలి?' అనిపించింది క్రాంతి కుమార్‌కు. అతని ఆలోచనలు అతన్ని ఒక వేసవి సెలవు లలో జరిగిన సంఘటనల వైపు లాక్కుపోయాయి.

*　　*　　*

ఆ రోజు......

'రమా, రమా' అని ఆదుర్దాగా పిల్చాడు క్రాంతి కుమార్. రమ తన గదిలోనుండి హాల్లోకొచ్చింది.

'ఏమిటన్నయ్యా'

'రేపు నీ పుట్టిన రోజు గదూ?'

'అవునన్నయ్యా'

'అవునన్నయ్యా ఏమిటి, చెప్పవేం? ఫ్రెండ్సెవర్నీ పిలవక్కర్లే' తానుగా ఏ విషయాన్నీ బయట పెట్టదు రమ.

'లేదన్నయ్యా' మన అరుణను, వాళ్ళ అన్నగార్ని మాత్రమే పిల్చాను. పెద్ద ఆర్భాటమేమీ చేయదల్చుకో లేదు' అంది తలవంచుకుని.

'అలాగా, వెరీగుడ్' అని పత్రిక చదవటంలో లీనమై పోయాడు క్రాంతికుమార్. కాని హఠాత్తుగా అతనికేదో స్ఫురించింది. 'అరుణ, వాళ్ళ అన్నగార్ని' అంది రమ. ఆ మాట రమ నోటంట కొత్తగా ధ్వనించింది. ఎప్పుడూ 'రఘురాం' అనే రమ ఈ రోజు పేరును ఉచ్చరించ లేదెందుకనో.

క్రాంతికుమార్‌కు నవ్వు వచ్చింది. తన మనసెప్పుడూ ఎక్స్‌రేలా పని చేస్తుంటుంది. ఏమీ లేని విషయంలో కూడా ఏదో అంతరార్థం దాగి ఉందని అనుమానించి పరిశోధించే మనస్తత్వం. రమ ఏమన్నా రఘును ప్రేమిస్తోందా?

రమ, అరుణల స్నేహం హైస్కూలు చదువుతో అంతమవకుండా తర్వాతకూడా దినదినాభివృద్ధి పొందింది.

వారి వలన ఆ రెండు కుటుంబాలకు రాకపోకలు ఏర్పడినై. అరుణ తరచుగా రమకోసం వస్తుండేది. క్రాంతికుమార్ వద్ద కూడ క్రమేపీ అరుణకు చనువు, స్నేహం ఏర్పడినై. 'అలాగే రమకు, రఘుకు గూడ స్నేహం ఉందేమో? వారిద్దరికీ వివాహం చేస్తే!' అనుకున్నాడు క్రాంతికుమార్. వెంటనే అమ్మదగ్గరకు వెళ్ళి ఆ విషయం ప్రస్తావించాడు.

'అవున్రా క్రాంతి! నాకూ అనిపిస్తోంది. రమకు కూడా ఆ అభిప్రాయమున్నట్లు నే నీటీవల గమనించాను. కాని వాళ్ళతో వియ్యం అందని పండేమో' అన్నది అమ్మ.

నిజమే. అందచందాలలోనూ, చదువు సంధ్యల్లోనూ సరితూగవచ్చేమో గాని వాళ్ళ అంతస్థుతో సరితూగ లేమేమో నని పించిం దతనికి. అయినా రఘు అభిప్రాయం ఎలావుందో తెలుసుకోవాలనిపించింది.

ఆ మర్నాడు రఘు, అరుణ వచ్చారు — రమ బర్త్ డే పార్టీకి. బర్త్ డే గిఫ్టుగా రమకు ఒక 'రింగు' ప్రెజెంటు చేశాడు రఘు. ఫలహారాలు కాఫీలు అయింతర్వాత 'ఏదైనా పిక్చరుకు వెళ్దామా రఘూ!' అన్నాడు క్రాంతి కుమార్. "ఓ యస్. తప్పకుండా. అరూ! తన బర్త్ డే పార్టీతో పాటు సినిమా పార్టీ కూడా ఇప్పించుమ మీ రమ చేత.' అన్నాడు రఘు. సినిమాకు నలుగురూ కలిసి వెళ్ళే భావం టుందనే ఉద్దేశ్యాన్ని వ్యక్తపరుస్తూ. అరుణ రమవేపు చూసింది. 'ఏమంటావ్' అన్నట్లు. రమ కళ్ళతోనే తన అంగీకారాన్ని తెల్పింది.

రమ, అరుణ రిక్షాలో కూర్చున్నారు. రఘు, క్రాంతి కుమార్ మరో రిక్షాలో ఎక్కారు. ఒకదాని తర్వాత మరో కటి రెండు రిక్షాలూ పరుగులు తీస్తున్నై. వాటిని మించిన వేగంతో క్రాంతికుమార్ మనసులోని ఆలోచనలు పయ నిస్తున్నై. 'ఇదే సమయం. రఘుతో రమ విషయం ప్రస్తా వించాలి' అనుకున్నాడు క్రాంతికుమార్. సంభాషణ ఎలా మొదలెట్టాలో ముందుగా మనసులో మననం చేసుకుని గొంతు సవరించుకున్నాడు క్రాంతికుమార్. ఇంతలో,

'మిస్టర్ క్రాంతికుమార్! నేనొక ముఖ్య విషయాన్ని మాట్లాడాలనుకుంటున్నాను' అన్నాడు రఘు.

క్రాంతికుమార్ ఆశ్చర్యపోయాడు. రఘు మాట్లాడా లనుకునే ముఖ్య విషయం ఏమిటా అని ఆలోచించాడు. బహుశా రమను వివాహం చేసుకుంటానని చెప్తాడేమో అనుకున్నాడు. 'ఏమిటది ?, అన్నాడు.

రఘు కొన్ని నిముషాలు మౌనంగా వుండి 'నీకు తెలుసుగా, రమ, అరుణల స్నేహం మూలంగా మన మిరు వురమూ స్నేహితులమయ్యాము. మన మిరువురమే ఏమిటి మన రెండు కుటుంబాలూ చేరువయ్యాయి. కాని, వచ్చే సంవత్సరంతో నీ మెడిసిన్ అయిపోతుంది, నా ఇంజనీరింగ్ పూర్తవుతుంది. తర్వాత ఇద్దరికీ ఎక్కడో ఉద్యోగాలవుతవి. మన స్నేహం మరుగు పడటానికి అవకాశం ఉంటుంది. అలా కాకుండా మన రెండు కుటుంబాలకు ఒక బాంధవ్యమంటూ ఉంటే...... ' అన్నాడు.

'అవును, బాగానే ఉంటుంది.' అన్నాడు క్రాంతి కుమార్. రఘు చెప్పబోయే విషయానికి అనుకూల వాతావరణాన్ని ఏర్పరచాలనే ఉద్దేశ్యంతో రఘు అన్నాడు:

'నాకు తెలుసు నీవు నాతో ఏకీభవిస్తావని... బహుశా నీకీ విషయం తెలిసే వుంటుంది. మా అరుణ నిన్ను ప్రేమిస్తోందని."

క్రాంతికుమార్ ఆశ్చర్యపోయాడు. ఏం మాట్లాడాలో తోచ లేదు. తన చెల్లెలి విషయం తను ప్రస్తావించ దల్చుకుంటే రఘు కూడా తన చెల్లెలి విషయం ప్రస్తావించాడు. అరుణ తనను ప్రేమిస్తోందా? అరుణను తను ప్రేమిస్తున్నమాట వాస్తవమే. కాని అరుణ కూడ తనని ప్రేమిస్తోందని తను గమనించలేకపోయాడు ... చివరకు క్రాంతి కుమార్ అన్నాడు:

'నిజమే రఘూ! కాని నా విషయంలో కంటే ముందు నేను రమ వివాహం విషయం ఆలోచించాలి.'

'నీకభ్యంతరం లేకపోతే రమను నేను వివాహం చేసుకుంటాను' అన్నాడు రఘు మెల్లిగా.

క్రాంతికుమార్ ఆనందంతో ఉక్కిరిబిక్కిరై 'రఘూ' అంటూ మిత్రుని కౌగలించుకున్నాడు...

ముందు రిక్షాలో వెళ్తున్న అరుణ, రమ వెనక్కు చూసి కిల కిల మన్నారు. రిక్షా గంటలు గణ గణ మన్నవి.

క్రాంతికుమార్ ఈ విషయం అమ్మకి, చెల్లికి చెప్పాడు. ఇంత త్వరలో సంబంధాలు కుదురుతాయని కలలో

కూడ అనుకోని అమ్మకు విరబూచిన మల్లె పందిరిలా అవటంతో రమకు ఆ రాత్రి నిద్రే పట్టలేదు.

ఆ మర్నాడు క్రాంతికుమార్ తన గదిలో కూర్చుని చదువుకుంటున్నాడు. అరుణ వస్తూనే 'రమా!' అని పిల్చింది. గట్టిగా వంటింట్లో పని చేసుకుంటున్న రమ గబ గబా వచ్చింది.

'నీ వింత మోసం చేస్తావని నే కల్లో కూడ అనుకో లేదు' అరుణ అంది సీరియస్‌గా. రమ నిర్విణ్ణు రాలైంది. తనమీద వచ్చిన అభియోగం ఏమిటో అర్థం కాలేదు రమకు. తన స్నేహితురాలు అరుణ, తనమీద ఏదో 'అభాండం వేస్తోందేమి చెప్మా' అని ఆశ్చర్యపోయింది.

అరుణ మళ్ళీ అంది: 'నీ వింత పని చేస్తావని ముందుగా తెలుస్తే నేనేం చేసేదాన్నో తెలుసా?'

ఇంతలో అమ్మ వచ్చింది: 'ఏమిటి అరుణా, ఏం చేసిందేమిటి రమ' అంటూ.

'ఏం చేసిందేమిటి? పచ్చి దొంగండీ'

రమకు రోషం వచ్చింది. 'అరుణా మాటలు తిన్నగా రానీ, నేనేం దొంగతనం చేయలా' అంది.

'చెయ్యలేదూ, మా అన్నయ్య మనసు దొంగిలించ లేదూ'!

ముగ్గురూ ఒక్కసారిగా నవ్వారు. మబ్బులు విడిచిన చంద్రబింబలా భాసించింది రమ ముఖం. రమ అంది:

'నీవేం నంగనాచివా, మెత్తగా కన్పిస్తున్నాడు గదా అని మా అన్నయ్యను నీ వలలో వేసుకున్నావుగా!' మళ్ళీ

ముగ్గురూ నోటి నిండుగా నవ్వుకున్నారు. 'బాగుంది ముగ్గురు ముగ్గురే జోడు దొంగలు' అమ్మ వ్యాఖ్యానించింది. ఈ మాట వింటున్న క్రాంతికుమార్ కూడా ముసి ముసి నవ్వులు నవ్వుకున్నాడు.

మళ్ళీ వచ్చే సెలవులకు క్రాంతికుమార్ ఇంటికి వచ్చేసరికి ఒక ఘోరమైన దృశ్యం అతని కంట బడింది. అతని నోట మాట రాలేదు. అచేతనుడై నిల్చుండిపోయాడు. తానిన్నాళ్ళుగా ఊహించుకున్న విషయాలు, ఆశించిన ప్రయోజనాలు ఒక్కొక్కటిగా మాసిపోతున్నట్లనిపించింది. 'అమ్మా' అన్నాడు. 'అమ్మా, ఏమిటనా్మ ఈ ఘోరం.'

అమ్మ ఏం జవాబు చెప్తుంది? 'మనల్ని వెంటాడుతున్న దురదృష్టం నాయనా' అంది పైట చెంగుతో కళ్ళనొత్తుకుంటూ.

'నాకు తెలియపర్చ లేదేమమ్మా'.

'తెలియజేయవలసిందే బాబూ' కాని, నీకు పరీక్షలు జరుగుతున్నాయికదా, నీ పరీక్షలకు ఆటంకం ఎక్కడ ఏర్పడుతుందో నని, రమే వద్దంది. ఎప్పటిలాగా పంపు వద్ద నుండి నీళ్లు పట్టుకొస్తోంది. గడపలో చీర కాలి వ్రేళ్ళకు తగిలి పడింది. వెంటనే హాస్పిటలుకు తీసుకవెళ్ళి కట్టు కట్టించాను.' అంది అమ్మ. మంచంలో కూర్చుని అర చేతులతో ముఖాన్ని కప్పుకొని ఏడుస్తున్న రమ వద్దకు నడిచాడు క్రాంతికుమార్.

రమ కాలికి ఏర్పడ్డ గాయం మానినా గాయం ఏర్ప రచిన గుర్తు మాత్రం అలాగే నిల్చిపోయింది. ఫలితంగా రమ సరిగా నడవలేదు. నడకలో కుంటితనం కొట్టవచ్చినట్లు కన్పడుతుంది.

వేసవి బరువుగా వెళ్ళిపోయింది. వేసవి శలవుల్లో ఏ ఒకటి రెండు సార్లో రఘూ, క్రాంతికుమార్ కలుసుకున్నారు. రఘు ముభావంగా ఉండేవాడు. ఇదివరకులాగా మాట్లాడటం లేదు. అందుకు గల కారణాన్ని ఊహించలేక పోయాడు క్రాంతికుమార్. అరుణ మాత్రం రమ కోసం వచ్చి పోతూనే ఉంది. రమకు కలిగిన ప్రమాదం అది తన జ్ఞాపక చిహ్నంగా నిలిపి పోయిన అవిటిదనం, అరుణకు తీరని అఘాతంలా పరిణమించింది. అరుణ తన దుఃఖాన్ని పైకి తెలిపితే రమ మరీ బెంబేలు పడుతుందని, లోలోపలే అణచుకుంటూ రమకు ధైర్య వచనాన్ని చెప్పేది. పైకి వెలిబుచ్చ లేక లోపల ఇముడ్చుకో లేక అరుణ పడే బాధని క్రాంతి కుమార్ గమనించకపోలేదు.

కాని, ఒక్క విషయాన్ని మాత్రం విస్మరించాడు క్రాంతికుమార్. అమ్మ చెప్పేవరకూ అతనికా సంగతే స్ఫురించలేదు. అమ్మ చెప్పిన తర్వాత ఆ విషయమై ఆలోచించగా ఎందుకో భయం వేసింది. అంతలోనే తనకు తాను ధైర్యం చెప్పుకున్నాడు. 'రఘు అలాంటివాడు గాదు రమను వివాహం చేసుకుంటానంటూ తానుగా ముందుకు వచ్చిన వ్యక్తి ఇప్పుడు రమ దురదృష్టవశాత్తు ప్రమాదానికి

లోనయినంత మాత్రం చేత ఆమెను వివాహ మాడటానికి విముఖుడౌతాడా? రమకు ఏం లోటు అని? నడకలో కొంచెం అవుడు. అదైనా శ్రద్ధగా గమనిస్తే గాని కనుపించదు.– అని. ఏమైనా రఘుతో ఒకసారి మాట్లాడాలనున్నాడు.

ఆ సాయంత్రం అనుకోకుండా పార్కులో కలిసాడు రఘు. ఆ మాటా ఈ మాటా మాట్లాడిన తర్వాత 'రఘూ! మనిద్దరికి స్టడీస్ అయిపోయాయి. ముహూర్తాలు పెట్టించమంటోంది మా అమ్మ' అన్నాడు నవ్వుతూ.

'మనిద్దరికీనా' అన్నాడు రఘు, నవ్వును తెచ్చి పెట్టుకుంటూ.

క్రాంతికుమార్‌కు కూడా నవ్వు వచ్చింది తన సంభాషణ ధోరణికి.

'అది కాదోయ్. అమ్మ రెండు పెళ్ళిళ్లూ ఒకేసారి జరగాలంటుంది. కాని నాకేమో లోగడ నీతో చెప్పినట్లు ముందు మీ వివాహం అయిన తర్వాత...

'లోగడ జరిగిన విషయాలు మర్చిపోవటం మంచిదేమో కుమార్! అన్నాడు రఘు ఎటో చూస్తూ.

రాకూడదు, రాదు అనుకున్న మాట రఘు నోటంట రానే వచ్చింది. క్రాంతికుమార్ గుండెల్లో రాయి పడింది. కొంతసేపటివరకు తేరుకోలేక పోయాడు. చివరి కెలాగైతేనేం 'అదేమిటి రఘూ' అనగల్గాడు.

రఘు అదోలా నవ్వాడు. 'కుమార్! లోగడ రమను వివాహం చేసుకుంటానని నే నన్న మాట నిజమే, కాని, అప్పటి పరిస్థితులు వేరు. ఇప్పటి పరిస్థితులు వేరు. ఎంతైనా మనం మానవ మాత్రులం. చూస్తూ, చూస్తూ జీవితాన్ని దుఃఖభాజనం చేసుకోగలమా? రమను చూస్తుంటే నాకూ జాలి కలుగుతుంది. కాని ఇది ఒక జీవిత సమస్య. మంచిచెడ్డ లన్నీ చూచుకుని మరీ అడుగు ముందుకు వేయవలసిన ఘట్టం. దయ, జాలి, స్నేహము మొదలైన భావాలకు తావు లేదు. ఎవరి సంగతు లెలా వున్నా నేను రమను చేసుకోలేను. మీ 'అందరికీ కష్టం కలిగిస్తే క్షంతవ్యుణ్ని' అన్నాడు. క్రాంతి కుమార్ ఇక అక్కడ ఉండలేకపోయేడు.

అంతే. మళ్లీ రఘును చూడటం తటస్థించలేదు. కొద్ది రోజులలో రిజల్ట్సు వచ్చాయి. క్రాంతి యూనివర్శిటీ కంతకూ ఫస్టున వచ్చాడు. కాని అతనికి కలుగవలసిన ఉత్సాహం కలుగలేదు. రమ వివాహం విషయం ఒక సమస్యగా తయారై తన కళ్ళముందు మాట మాటికీ ప్రత్యక్షమౌతుంది. రఘు అన్న మాటల్లో నిజం లేకపోలేదు. చూస్తూ చూస్తూ కుంటి దాన్ని ఎవరు చేసుకుంటారు.? మరి రమకు పెళ్ళేలా అవుతుంది? అనిపించేది. నిలువునా నీరు కారి పోయేవాడు. ఆ ఆలోచనలు అతనిని కొన్నాళ్ళ పాటు ఎటన్నా పారిపోదామన్నంతగా బాధించాయి.

విశాఖపట్టణం వెళ్ళి ప్రొఫెసర్లకు ఓ మారు కన్పించి వస్తానంటూ బయలుదేరిన క్రాంతికుమార్‌కు అప్పుడే పోస్టు మాన్ యిచ్చి వెళ్ళిన కవర్లు రెంటిని అందించింది రమ.

ఆత్రుతగా ఒక కవరు చింపాడు క్రాంతికుమార్. అందులోని ఉత్తరాన్ని గబగబా చదివి 'రమా!' అంటూ చెల్లెల్ని కౌగలించుకొని ఆమె తలను ఆప్యాయంగా ముద్దుపెట్టుకున్నాడు. విషయమేమిటో అర్థంకాని రమ, ఉక్కిరిబిక్కిరి అయిపోయింది. "ఏమిట్రా క్రాంతి?" అని అడిగింది అమ్మ మెరిసే కళ్ళతో.

"పై చదువులకు ఫారిన్ పంపటానికి యూనివర్శిటీ వాళ్ళు నన్ను రికమెండు చేశారుటమ్మా. ప్రొఫెసరు వ్రాశారు." అన్నాడు క్రాంతికుమార్, రెండవ కవర్ని చింపుతూ. అది యూనివర్శిటీలో ఒక రీడగు వ్రాసింది. పాసైనందుకు, ఫారెన్ వెళ్ళబోతున్నందుకు తన అభినందనల్ని తెల్పుతూ వ్రాశాడు.

కాని క్రాంతికుమారుకు ఉన్నట్టుండి ఒకటే దిగులు పట్టుకుంది. ఫారిన్ వెళ్ళటానికి ఎలా లేదన్నా ఐదువేల రూపాయలు కావాలి. తను ఎక్కడనుండి తేగలడు? ఉన్న ఎకరం పొలం అమ్మితే, రమ వివాహం ఎలా జరుగుతుంది? రమకు నడకలో అవిటితనం పోనంత కాలం తనకు మన శ్శాంతి లేదు. తన వైద్య విజ్ఞానాన్నంతా ఉపయోగించి ఆమె నడకలోని లోపాన్ని తొలగించలేడా? ఆమె భావిజీవితానికి ప్రతిబంధకంగా కనిపించే ఆ లోపాన్ని ఏవిధంగానైనా పోగొట్టాలి-అనుకున్నాడు.

రమ అంది "అన్నయ్యా, నా కాలికి, నా వివాహానికీ, నీ చదువుకు ముడిపెట్టకు. పొలం అమ్మి నీ చదువును

పూర్తిచేసుకుని రా. అప్పుడు నా కాలు బాగుచేయటానికి అవకాశం ఉంటుంది. నా వివాహం కూడా అప్పుడే."

రమ చెప్పిందాంట్లో ఎంతో నిజం ఉందనిపించింది. ఆ ప్రకారం చేయటానికే నిశ్చయించుకున్నాడు.

ఉన్నట్టుండి సీతాపతిగారు వచ్చారు క్రాంతికుమార్ వద్దకు. "ఏమోయ్, ఫారిన్ వెళ్తున్నావటగా! చాల సంతోషం. ఫారిన్ వెళ్ళే అవకాశం దొరకటమే చాలా కష్టం. అలాంటిది యూనివర్సిటీవారే నిన్ను కావాలని పంపుతున్నారంటే అంతకంటే కావలసిందేముంటుంది?" అన్నారు.

"మా బోటివారికి అవకాశాలుండి మాత్రం ఏం ప్రయోజనంలెండి. అన్నిటికంటే ముఖ్యం ఆర్థిక స్తోమత ఉండాలిగా" అన్నాడు క్రాంతికుమార్.

సీతాపతిగారు వింతగా చూసి అన్నారు: "అంటే? కొంపదీసి వచ్చిన అవకాశాన్ని వదులుకోటం లేదుగదా!"

"అపనే చేద్దామనుకుంటున్నాను.........."

"కుమార్! నీకు చెప్పగలిగినంతటి వాడ్ని కాదుగాని ఒక్క మాట. ఇప్పుడు డబ్బులేదని నీవు ఫారిన్ వెళ్ళటం మానేస్తానంటున్నావు, అవునా? కాని ఈ అవకాశం నీవు ప్రాక్టీసుపెట్టి డబ్బు గడించిం తర్వాత కావాలంటే వస్తుందా? నీ విలాంటి దేదో తలపెట్తావనే అనుమానంతో నేనిటు వచ్చాను."

సీతాపతిగారు రావటంలో ఏదో అభ్యంతర ముండి ఉంటుందని ఊహించిన క్రాంతికుమార్ అనుమానం నిజమే

అయింది. ఆశ్చర్యంగా ప్రశ్నార్థకంగా సీతాపతిగారి వైపు చూశాడు.

"నీ కభ్యంతరం లేకపోతే నీకు కావలసిన డబ్బు నేను అడ్వాన్సు చేస్తాను."

సీతాపతిగారి మనసులోని ఆలోచన ఇదన్నమాట! ఈ ఆలోచనకు మూలం అరుణ వివాహమూ? నా అల్లుడు ఫారిన్ రిటర్న్డు డాక్టరు అని సగర్వంగా చెప్పుకోవాలని గాబోలు! క్రాంతికుమార్‌కు అహం అడ్డు వచ్చింది.

"క్షమించండి సీతాపతిగారూ! నేనింతవరకు ఒకరి సహాయాన్ని అర్థించలేదు. ఇప్పుడు అర్థించటం లేదు. అయాచితంగానే సహాయం చేస్తామంటున్న మీ ఉదారబుద్ధికి కృతజ్ఞుణ్ని. కాని మీ సహాయాన్ని కాదంటున్నందుకు మన్నించండి" అన్నాడు.

సీతాపతిగారు కొన్ని క్షణాలు మౌనంగా వుండి "దాందేముందిలే కుమార్! కాని కష్టాల్లో కూడ దిగజారని నీ మనస్థయిర్యానికి, నీ ఉన్నత భావాలకు నా అభినందనలు' అన్నారు.

"మీరు మరో విధంగా భావించకండి"

"నేనలాంటి వాడ్ని కాదు కుమార్! పోనీ ఒక విషయం చెప్తావా? అదీ మీ వివాహవిషయం. మళ్ళీనీవు రావడం మూడు సంవత్సరాలకు గదా! మరి వివాహం ఇప్పుడే జరిపితే మంచిదని మా ఉద్దేశ్యం. మీ అమ్మగారేమంటుంది?"

రఘూ కూడా యింతే. చెప్పదల్చుకున్న విషయాన్ని నిర్మొహమాటంగా చెప్పేశాడు సీతాపతిగారుకూడ అడగ

వలసింది నిర్మొహమాటంగా అడిగేశారు. ఎదుటివారి ఇష్టా యిష్టాలు, కష్టసుఖాలు పరిస్థితులు ఇవేమీ గమనించలేని ఒక జాతి ఉంది. ఆ జాతికి చెందినవారు సీతాపతిగారు, రఘు —అనుకున్నాడు క్రాంతికుమార్.

"వివాహం విషయం ఇప్పుడేం తలపెట్టటంలేదు సీతాపతిగారూ! నా చదువు పూర్తయితే కాని మా కుటుంబం కుదుటపడదు. మా కుటుంబం కుదుటపడితేనే మా రఘు వివాహం చేయగలిగేది. ఆ తర్వాతనే నావివాహం. అంతవరకూ నేనేమీ మాట్లాడలేను" క్రాంతికుమార్ మాటలకు ఏమను కున్నారో ఏమో సీతాపతిగారు 'సరే, వస్తా' నంటూ వెళ్ళారు.

క్రాంతికుమార్ స్విడ్జర్లాండు వెళ్ళటానికి ఆయత్త మౌతున్న రోజు అరుణ వచ్చి కలిసింది. గదిలో ఒంటరిగా ప్రయాణ సన్నాహాలు చేసుకుంటుంటే లోనికి వచ్చి 'ప్రయాణ సన్నాహంలో ఉన్నట్టున్నారే, నన్ను కూడా సాల్పు చెయ్యమంటారా?' అంది నవ్వుతూ.

"ఓ తప్పకుండాను' అని "రా అరుణా! నీకోసమే వద్దామనుకుంటున్నాను. కూర్చో" అన్నాడు క్రాంతి కుమార్. అరుణ కూర్చుంది. కొంచెంసేపు ఇరువురి మధ్య మౌనం నిల్చింది. ఆ మౌనం ఎందుకనో చాలా భయం కరంగా అనిపించింది క్రాంతికుమార్‌కు ఆ మౌనాన్ని భంగ పరుస్తూ దుఃఖం, భయం, మిళితమైన స్వరంతోనూ, పెద వులపైని తెచ్చికోలు నవ్వుతోనూ అంది అరుణ, "నన్ను మర్చిపోతారు గాబోలు" అని.

ఆ మాటల్ని అరుణ హాస్యాని కన్నదో, నిజంగానే అన్నదో, లేక నిజంగానే తనకా శంక కలిగి అన్నదో క్రాంతి కుమార్ ఇదమిత్థంగా ఊహించలేకపోయాడు.

"అదేమిటి అరుణా అలా అంటావు? మానవునికి అసాధ్యమంటూ ఏదీ లేదని నే ననుకుంటూ ఉండేవాడ్ని. కాని యిప్పుడు తెలుస్తోంది, తన కిష్టులైన వారిని, హృదయానికి సన్నిహితులైన వారిని మానవుడు—ముఖ్యంగా నాబోటి వ్యక్తి—మరచి పోదామన్నా మర్చిపోలేడని."

క్రాంతికుమార్ మాటలు అరుణకు తృప్తికలిగించాయి. అందుకని మరిక మాట్లాడలేకపోయింది. అయినా, మనసులో అప్పుడే జనించి వటుడింతై, ఇంతింతై అన్నట్లు పెరిగిన కొన్ని మూగ భావాలు ఆమె కళ్ళను నీటితో కప్పి వేసినై. దుఃఖం పెల్లుబికింది.

ఆమె కన్నీటికి కారణమేమిటో క్రాంతికుమార్ కి అర్థంకాలేదు. "ఏమిటి అరుణా! ఎందుకలా కన్నీరు పెట్తావు? ఏం జరిగింది? నాతో చెప్పు" అంటూ ఆమె బుజాలను తన రెండు చేతులతోనూ పట్టుకుని తనవేపు త్రిప్పుకుని కర్చీఫుతో ఆమె కన్నీటిని తుడిచాడు.

"ఇంతవరకూ ఏమీ జరుగలేదు" అంది అరుణ.

"ఇక మాత్రం ఏం జరుగుతుందని?"

"మా నాన్నగారు ఇక్కడికి వచ్చారుటగా"

అవునన్నాడు. అరుణ మళ్ళీ కొంతసేపటివరకూ మాట్లాడలేదు చివరకు 'మీకిది న్యాయమేనా చెప్పండి.

మా అన్నయ్య రమను చేసుకోనన్నాడని మీరు మన వివాహానికి ఒప్పుకోలేదుటగా" దీనంగా అని, బావురుమంది.

క్రాంతికుమార్ చలించిపోయాడు. దుఃఖం; ఆశ్చర్యం రెండూ ముంచుకొచ్చినై. తానా విధంగా అన్నాడా; లేకపోతే సీతాపతిగారు ఆ విధంగా అర్థంచేసుకున్నారా?

"అరుణా! నీమాటలు చాలా బాధకలిగిస్తున్నై నాకు. నే నావిధంగా అనలేదు. ఆమాటకొస్తే రఘు నా చెల్లెల్ని చేసుకోనన్నాడని నేను నిన్ను తృణీకరించాలనే భావమే నాకు స్ఫురించలేదు. మీనాన్నగారితో నే చెప్పినదల్లా ఒక్కటే. నా చదువు పూర్తయి, నా వృత్తిని నేను చేపట్టేనేగాని రమ వివాహం చేయటం పడదు. ముందు రమ వివాహం జరిపించిన తర్వాతనే నా వివాహ విషయం నేను ఆలోచించేది అన్నాను. ఇందులో నా తప్పేమైనా ఉందా?"

అరుణ జవాబు చెప్పింది. "నాన్నగారికి ఆ అర్థం స్ఫురించదేమో మరి. ఆయన అన్నయ్యతో ఆ విధంగా చెప్పాడు. అన్నయ్య అనరాని మాటలు అన్నాడు."

"ఏమని?"

"ఫారిన్ వెళ్తున్నానని మీకు గర్వం వచ్చిందని, నాకు వేరే సంబంధం చూసి పెళ్ళి చేస్తానని, ఇంకా ఏమేమో అన్నాడు."

క్రాంతికుమార్ నిట్టూర్చాడు. "ఎవరో ఏదో అనుకున్నారని, అన్నారని, అనుకుంటారని నేను నా మనసును మార్చుకునే మూర్ఖుడ్ని గాదు అరుణా,"

అప్పుడే "అరుణా" అంటూ రమ లోనికి రాబోయి పడబోయింది. అరుణ గబగబా రమను పట్టుకుంది.

* * *

మరో సంవత్సరానికి చదువు ఐపోతుందనగా స్విడ్జర్లాండులోని క్రాంతికుమార్‌ను వెతుక్కుంటూ ఒక కవరు వచ్చింది. తన వివాహానికి ఆహ్వానాన్ని పంపుతూ అరుణ వ్రాసిన కవరది. శుభలేఖను చూసి విస్తుపోయాడు క్రాంతి కుమార్. ఇలా జరుగుతుందేమోనని అనుమానం, భయం తనకు కల్గినా, ఇన్నాళ్ళుగా తనా అనుమానాన్ని భయాన్ని మనసులో నుండి తుడిచివేసుకుని సమాధానపడ్తున్నాడు. కాని జరగకూడదనుకున్నది జరుగనే జరిగింది. ఎందుకని? అరుణ ఈ వివాహానికి ఎందు కంగీకరించింది? తనమీద నమ్మకం లేకపోవటంచేతనా? లేక ఆమె అభీష్టానికి భిన్నంగా రఘు, సీతాపతిగారు, బలవంతంగా ఈ పెళ్ళి జరుపుతున్నారా? వాళ్ళ అన్యాయానికి బలియై జీవితాంతం తీరని ఆవేదనతో, అసంతృప్తితో అరుణ బాధపడవలసిందేనా? ఇందుకు మూలకారకుడు తనేగదూ! తను ఈ చదువులకు దూర దేశాలకు రావటం వల్లనేగదూ? తను వివాహాన్ని ఆప లేడా?

ఈ ఆలోచనలు అతనిలో ఆవేశపూరితమైనఆవేదనను కలిగించినై. ఏ విధంగానైనా పెళ్ళి వివాహాన్ని ఆపాలని పించింది. కాని శుభలేఖలోని తేదీ అతన్ని వెక్కిరించినట్లు వంకరలు తిరిగింది. ఈపాటికి పెళ్ళి జరిగిపోయి ఉంటుంది.

పెళ్ళి జరిగిన మూడు రోజులకు పెళ్ళి పిలుపు! నిర్వేదమైన నిర్జీవమైన చిరునవ్వు ఒకటి అతని పెదవులవరకూ వచ్చివచ్చి ఆగిపోయింది. కవరులోని ఉత్తరాన్ని బయటకు తీశాడు.

'డాక్టరు క్రాంతికుమార్ గారికి—

నేనీవిధంగా ఉత్తరం వ్రాయవలసి వస్తుందని మీరు ఇక్కడనుండి బయలుదేరిన నాడే అనుకున్నాను. కాని...మన కయిష్టమైన సంఘటనలు జరుగుతాయని మనసుకు తోచినా ఆభావాన్ని బయటికి వెలువరించము సామాన్యంగా. నా విషయంలో గూడ అంతే జరిగింది. అదీగాక అలాంటి అయిష్టమైన సంఘటనలు జరుగవని, తాత్కాలికంగానైనా, నమ్ముతూ తద్వారా మనసును సమాధానపరచుకుంటూ 'ఆశ' తో జీవించటమే మానవుల లక్ష్యం—అనే వేదాంతం బాగా తలకెక్కింది నాకు. ఈ వేదాంతం ఇవన్నీ నేనెందుకు వ్రాస్తున్నానో ఈ పాటికి ఈ కవరులో ఉన్న శుభలేఖ మీకు చెప్పే ఉంటుంది. మీరు నాతో చెప్పిన విషయాలన్నీ నేను మాఅమ్మద్వారా నాన్నగారికి చెప్పించాను. ఆయన విన్నారు. విని వూరుకున్నారు. కాని మా అన్నయ్య వూరుకోలేదు. భగ్గుమన్నాడు.'నాన్నా!కుమార్ ఇక్కడ చెప్పివెళ్ళినమాటనిజమే. కాని ఇప్పుడు తను ఉంటున్నది దేశంకాని దేశంలో. విదేశ చదువులకంటూ పోయి దొరసానిని వెంటబెట్టుకుని స్వదేశానికి తిరిగివచ్చిన ప్రబుద్ధు లెంతమంది లేరు? కుమార్ అలా చేస్తాడని నేననడంలేదు. కాని కీడెంచి మేలెంచమన్నారు. అదీగాక కుమార్ తిరిగి వచ్చిం తర్వాత అతణ్ని అల్లుణ్ని చేసుకోవాలనే ఆశతో ఎంతోమంది ఆడపిల్లల తండ్రులు

గాలాలు తయారుచేసుకుంటున్నారు. ఈ అవకాశాన్ని ఆసరాగా తీసుకునికట్నం ఎంతైనా'పలుకవచ్చు'.అప్పుడుకుమార్‌కు అరుణమీద జాలిజనిస్తుందేకాని వెనుకటి అభిమానం, మాట గుర్తుండదు. ఎంతైనా మనం మానవ మాత్రులం. అందుకని... ఈ సంబంధం మాత్రం తక్కువదా? మధు ఇంజనీర్‌గా పనిచేస్తున్నాడు. పెద్ద బంగళా, కారు ఇంటినిండా నౌకర్లు...మధు అజమాయిషీలో మూడు మల్టీ పర్‌పస్ ప్రాజెక్టులు నిర్మిస్తున్నారు! కలసి వచ్చిన ఈ సంబంధాన్ని కాలదన్నుకోటం తెలివైనపనిగాదు......' అంటూ బోధ చేశాడు. ఫలితంగా శుభలేఖలు అచ్చయినాయి. మా అన్నయ్య పైకి ఆవిధంగా అన్నా, మీ విషయం బాగా తెలిసినవాడు. మీరు నన్ను అన్యాయం చేయరని ఆయనకు తెలియకపోలేదు రమను మొదట్లో పెళ్ళిచేసుకుంటానని మాట యిచ్చి కూడ తర్వాత మాట నిలబెట్టుకోలేకపోయాడు. కాని మీరలా కాకుండా ఒకేమాటమీద నిలబడ్డారు. మరొకరైతే 'నా చెల్లెల్ని నీవు చేసుకోకపోతే నీ చెల్లెల్ని నేనెందుకు చేసుకుంటాను' అని అంటారు సహజంగా. మీరలా అనలేదనే మా అన్నయ్యకు బాధ. మరి తను ఓడిపోయినట్లేగదూ; తనూ మానవమాత్రుడే గదా! ఇదొక కాంప్లెక్సు. ఇలాంటి కాంప్లెక్సుకు మీ డాక్టర్లు మందు కనిపెట్టలేరు. అందుకనే డాక్టరులైన మీరు నాకిష్టం లేదు. నేను ఇంజనీరునే పెళ్ళి చేసుకుంటాను. మల్టీ పర్‌పస్ ప్రాజెక్టులను నిర్మించే నా కాబోయే భర్త అనన్య సామా

న్యుడు. పెద్ద ఇంజనీరు. మాకు పెద్ద బంగళా, మంచి చిన్న కారు, పెద్దహోదా, పెద్ద... మీకు అసూయగా వుందా? నాకు పిచ్చెక్కిం దనుకుంటున్నారా? గొప్పలు చెప్పుకుని డప్పు కొడ్తున్నానంటారా? నిజమే గొప్పలే చెప్తున్నాను. నాకు పిచ్చెక్కలేదు. కాని అలా గొప్పలు చెప్పుకుంటుంటే నా కదొక విధమైన సంతృప్తి. సంతృప్తిలేని జీవితానికి సుఖ ముండదుగా. అందుకని ఏదో విధంగా సంతృప్తి ఎరువు తెచ్చుకోవాలి మరి... ఉంటా...

అరుణ'

క్రాంతి కుమారుకు పిచ్చెక్కినట్లయింది. కోపం, ద్వేషం, విసుగు ముంచుకొచ్చాయి. కాని అశక్తునివలె కూలబడిపోయాడు.

* * *

'జననీ జన్మభూమిశ్చ' అనుకుంటూ ఇంటికి తిరిగివచ్చిన క్రాంతికుమార్‌కి మిత్రులంతా బ్రహ్మరథం పట్టారు. అమ్మ ఆనందాశ్రువుల్ని వర్షించింది. చెల్లెలు ఉక్కిరిబిక్కిరి అయి అవిటిదవటం మూలాన పడబోయింది. చెల్లెల్ని పొదివి పట్టుకున్నాడు క్రాంతికుమారు.

రఘుకు నాగర్జునసాగర్‌లో సి. ఇ. ఉద్యోగం వచ్చి వెళ్ళిపోయాడు. అరుణ భర్తతోపాటు అనంతపూర్‌లో ఉంటోంది. అరుణ లేని ఆ వూరు వాసయోగ్యంగా అనిపించలేదతనికి. వెంటనే మకాం మార్చేసి గుంటూరులో ప్రాక్టీసు పెట్టాడు. గవర్నమెంటు హాస్పిటల్‌కు ఆనరరీ సర్జన్. అతని సలహాలేనిదే మేజర్ ఆపరేషన్ నేదీ జరగదక్కడ

ఎంతో అనుభవంతో కాని నేర్చుకోలేని ఎన్నో విషయాల్ని అనతికాలంలోనే తెలుసుకొని పదిమందిలో సెబాస్ అని పించుకున్నాడు. రమకు వివాహం చేయగలిగాడు. వాళ్ళ ఊరులో రీడరుగా ఉంటున్న తన మిత్రుడు ప్రభాకర్ రమను వివాహం చేసుకున్నాడు. రమ జీవితం సాఫీగా గడచిపో తుంది. తన జీవితం కూడ సాఫీగానే సాగిపోతోంది. అయితే ఒక్కటే లోటు. అప్పుడప్పుడు రమ మనసులో మెదిలి ఆవే దనల్ని కల్గిస్తోంది.

*  *  *

తెల్లవారుతూనే అరుణవచ్చింది. ఆమెతోపాటు ఆమె ఎడపిల్ల, చంటిపిల్లవాడు, రఘు, సీతాపతిగారు వచ్చారు. ముందుగానే ఖాళీ చేయించిన ముందు గదులు రెండూ వారికి ఏర్పాటు చేశాడు క్రాంతికుమార్.

రఘు బాగా చిక్కి శల్యమైపోయాడు. బాగా పెరి గిన గడ్డం, లోతుకు పీక్కుపోయిన కళ్లు, అస్థిపంజరంలా తయారైన శరీరం—క్రాంతికుమార్‌కు జాలివేసింది.

క్రాంతికుమార్‌ను చూడటంతోనే రఘు కళ్ళల్లో నీరు నిల్చింది. కన్నీటిని కనపడనీయకుండా చేసే ప్రయ త్నంలో రఘు తలవంచుకున్నాడు ప్రక్కనే కుర్చీలో కూర్చున్న సీతాపతిగారు కళ్లొత్తుకున్నారు.

“హల్లో రఘూ! హౌ ఆర్ యు నౌ?” క్రాంతి కుమార్ పలుకరించాడు. రఘు తల పైకెత్తి చూశాడు. కళా కాంతులులేక ఎండిన మోడులా కనిపించాడతను క్రాంతికుమార్‌కు. ‘ఎలా వుంది మీకు’ మళ్లీ అడిగాడు.

రఘు జవాబు చెప్పలేదు. సీతాపతిగారు చెప్పటం మొదలెట్టారు. "ఏమిటో మిస్ కుమార్! వాడి జీవితం పూర్తిగా దుఃఖ భాజనం కావాలని రాసిపెట్టి వుందిగాబోలు. లేకపోతే ఏవిటి చెప్పు. ఈ వయసులో రావలసిన జబ్బేనా ఇది? యమబాధపడుతున్నాడు. రాత్రిళ్ళు నిద్రవుండదు. పెద్ద వయసులో కొడుకును, మనమల్ని చూస్తూ కృష్ణా రామా అనుకుంటూ కాలం గడపవలసిన వయసులో కొడుకు దుర్గతిని చూస్తూ క్రుళ్లి క్రుళ్లి పోవలసినస్థితి రావటం నిజంగా నా దురదృష్టమే!"

"అలా అనకండి. బేంబేలు పడకూడదు మనం వచ్చే కష్టాల్ని చిరునవ్వుతో ఎదుర్కొంటేనే జీవితం సుఖమయమవుతుంది. రఘుకు ఏం ఫర్వాలేదు. అతని వ్యాధి నయం చేసే పూచీ నాది. ఈ పూటే హాస్పిటల్లో చేర్పిద్దాం' అన్నాడు క్రాంతికుమార్. లోపల్నుండి అప్పుడే వచ్చారు అరుణ, అమ్మ. "అమ్మా నాకు స్నానానికి నీళ్ళు తోడు" అని చెప్పి తన గదిలోకి వెళ్ళిపోయాడు క్రాంతికుమార్.

రఘును చూస్తుంటే క్రాంతికుమార్ కెందుకో భయం వేసింది. రఘు ముఖంలో విషాదచ్ఛాయలు కన్పించటం సహజమే కాని వాటితోపాటు అతని పెదవులపైన, కను రెప్పలక్రింద నీలినీడలు నాట్యమాడుతున్నై. నీలినీడలంటే తనకు భయం తన అనుభవంలో బ్లూయిష్‌నెస్ కనిపించిన కేసుల్లో సక్సెస్ అయినవి చాలా కొద్ది. 'ఛీ, ఛీ. ఏవిటి ఈ ఆలోచనలు. రోగిని యింతవరకు పరీక్ష చేయలేదు, లోని ఆర్గన్స్‌ను ఎక్స్‌రే తీయాలి. ఏదీ లేకుండానే ఏవిటి ఈ

పాడు ఆలోచనలు. కంగ్లాషన్నాను?' అనుకుని బుజాన టవలు వేసుకుని స్నానానికి బయలుదేరాడు.

స్నానాలగదిలో బాల్చీతో నీళ్ళు, సబ్బు పెట్టి వస్తోంది అరుణ. క్రాంతికుమారు ఆశ్చర్యంగా చూశాడు అరుణ పుట్టింటిలో గారాబంగా పెరిగింది. మెట్టినింటిలో వీసమెత్తు పనిచేయటానికి కూడా నౌకర్లు! "నీకెందుకు అరుణా ఈ శ్రమంతా" అన్నాడు.

"ఇందులో శ్రమేమీ లేదులెండి. మీ అమ్మగారికి సాయం చేస్తున్నాను. అంతే" అని వంటగదిలోకి వెళ్ళిపోయింది.

క్రాంతికుమార్‌కు స్నానం చేస్తున్నంతసేపూ ఏవేవో ఆలోచనలు ముసురుకున్నై. వెనుకటి రోజుల్లో అరుణ, తను సన్నిహితులుగా ఉన్నప్పుడు ఎలా ఉండేదో, ఎలా మాట్లాడేదో ఇప్పుడూ అలాగే వుంది, మాట్లాడుతోంది. కాని తను? అరుణ మరొకర్ని వివాహం చేసుకున్నప్పటినుంచి అరుణను గురించి తను ఊహించుకున్న స్వప్నాల్ని మరచిపోజొచ్చాడు. ఇక జీవితంలో అరుణను చూడటం, ఆ అరుణతో మాట్లాడటం పడదనుకున్నాడు. కాని అరుణ తన ఇంటికి వచ్చింది. తనకు అర్థాంగిగా తన ఇంటికి రావలసిన అరుణ అతిథిగా, తన వృత్తిరీత్యా తనతో అవసరం వుండి వచ్చింది - అవును అరుణ ప్రోద్బలంతోనే సీతాపతిగారు రఘును ఇక్కడికి తీసుకు వచ్చింది_అరుణతో తన వివాహం జరుగలేదే అని తానెంతగా దిగులుచెందాడో అరుణ అంత నిర్లిప్తంగా ఉందిప్పుడు. అసలు అలాంటిదేమీ జరుగనట్టే

మెసులుతోంది. కాని తను మాత్రం బెరుగ్గావుంటూ తన ప్రతి కదలికలోనూ, పలుకులోను తన దిగులుని ద్యోతకం చేస్తున్నాడు. బహుశా స్త్రీకీ పురుషునికిగల భేదాల్లో ఇదొక టేమో అనుకున్నాడు.

క్రాంతికుమార్ స్నానంచేసివచ్చేసరికి అరుణ టిఫిన్, కాఫీ సిద్ధంచేసింది. సీతాపతిగారు, క్రాంతికుమార్ కలిసి టిఫిన్ కాఫీ పూర్తిచేశారు. తర్వాత క్రాంతికుమార్ "అంబులెన్సును పంపుతాను రఘును తీసుకురండి" ని చెప్ప హాస్పిటలుకు వెళ్లాడు.

హాస్పిటల్లో రఘును పరీక్షచేయటానికి కావలసిన ఏర్పాట్లన్నీ చేయించాడు క్రాంతికుమారు. అంబులెన్సులో అరుణ, సీతాపతిగారు దిగి రఘును దింపి లోనికి తీసుకు వచ్చారు మెల్లగా. ఎగ్జామినేషన్ రూంలో ఎత్తయిన బల్ల మీద రఘును పడుకోబెట్టారు. అప్పటివరకు అక్కడే వున్న నర్సు శారద, క్రాంతికుమారు ఏదో పని పురమాయించగా లోపలికి వెళ్ళింది. రఘు క్రాంతికుమారు యిద్దరే ఉన్నారు ఆ గదిలో, 'కుమార్! నాకోసరం అనవసరంగా శ్రమతీసుకుంటున్నావేమో' అన్నాడు రఘు.

పరీక్షార్థం రక్తపు బొట్టును తీసుకోబోతున్న క్రాంతికుమారు అలాగే ఆగిపోయాడు. 'మిష్టర్ మీ రనవసరంగా భయపడుతున్నారు. యు.విల్ బి ఆల్‌రైట్ సూన్' అన్నాడు నవ్వుతూ.

ఆ నవ్వు ఆ మాటలు డాక్టర్లకు క్రొత్తకాదనే విష

యం రఘుకు తెలియకపోలేదు. అతని పెదాలపై వెలుగు లేని చిరునవ్వు అలా వచ్చి మాయమైంది.

ఇంతలో మరొక నర్సు అక్కడికి వచ్చింది. ఆమె చేతుల్లో ఏవో పరికరాలున్నవి. క్రాంతికుమారు ఆమె వేపు ఒక క్షణం చూసి "నీ వొచ్చావేం, శారద ఏమైంది?" అని అడిగాడు.

ఇంతలో మరొక నర్సు అక్కడికి వచ్చింది.

"అవసరమైన పనివుండి ఇంటికి వెళ్తున్నానని వెళ్ళి పోయింది; మీతో చెప్పమంది."

ఆ జవాబును విన్న డాక్టరు క్రాంతికుమార్‌కు కోపం వచ్చింది. ఈ శారద ఎప్పుడూ ఇంతే. తరచుగా మనస్సు బాగోలేదనో, యింటివద్ద పనివుందనో వెళ్తూవుంటుంది. ఆమె ఉంటే తనకు యెంతో తేలిక. ఇతర నర్సుల మోస్తరుగా కాకుండా తెలివిగా ఎన్నో పన్లు సర్దుకుపోతూ, తనకు రిలీఫ్ యిస్తుంది.

రఘుకు కేన్సరు బాగా ముదిరిందని తెలుసుకున్నాడు. పైగా పాయిజనస్. కేన్సరుకు సంబంధించిన విష పదార్థాలు రక్తంలో కలుస్తున్నవి. కేసు పూర్తి స్వరూపాన్ని సమగ్రంగా తెలుసుకున్న తర్వాతనే 'ప్రొగ్రసి ఈజ్ వెరీ గ్రిమ్,' అనుకున్నాడు. కాని పైకి ఏ భావాన్నీ వెలిబుచ్చ లేదు. ఒక వార్డులో ఒక బెడ్ కేటాయించాడు రఘుకి...

ఆ రాత్రి క్రాంతికుమారుకు నిద్రపట్టలేదు. రఘు విషయం పదే పదే గుర్తుకు వస్తోంది. 'పాపం చాల దీనావస్థ అతనిది. ఒకవేళ రమను వివాహం చేసుకుని ఉంటే?'

క్రాంతికుమార్ ఇక ఆలోచించలేకపోయాడు. 'చూస్తూ చూస్తూ జీవితాన్ని దుఃఖభాజనం చేసుకోగలమా'అన్నాడు రఘు. అంటే'నీ చెల్లెలు కుంటది. నే నెలా పెళ్ళిచేసుకునేది' అనేగా. కాని కుంటికి బదులు కురూపి ఎదురైంది, అతని జీవితంలో. సాయంత్రం అరుణ చెప్పింది... పెద్దకట్నం తీసుకుని అందమైన అమ్మాయినే రఘు పెళ్ళిచేసుకున్నాట్ట. కాని సంవత్సరం తిరక్కుండానే ఆ అమ్మాయికి మశూచికం వచ్చి శరీరమంతా ముఖమంతా గుంటలుపడి వికారంగా తయారైంది. రఘు అసహ్యించుకున్నాడు. 'నీతో కాపురం చేయలేను. నీవు రాగానే మా అమ్మ చచ్చిపోయింది. ఇప్పుడు నీవు కురూపివైనావు కొన్నాళ్ళకి నేనేమాతానో. నీ ముఖం నేను చూడలేను వెళ్ళిపో' అన్నాడుట. సీతాపతిగారు, అరుణ ఎంతో నచ్చచెప్పి, ప్రయత్నించి విఫలులైనారుట. పాపం ఆ ఇల్లాలు ఎంతగా కృంగి కృశించిపోతోందో.

భార్య పుట్టింటికి వెళ్ళిన తర్వాత రఘుకి ఉద్యోగం ఊడింది, కంట్రాక్టర్లతో లాలూచీ పడటంమూలంగా. అప్పటినుంచి ఇష్టమొచ్చినట్లు తిరిగాడు వేళకు తిండీ నిద్ర లేక మనిషి సగమై ఇంటికి చేరాడు. అలా తిరగటం వల్లనే ఈ జబ్బు వచ్చింది, అన్నారుట ఎవరో.

ముందు గదిలో అరుణ పసిపిల్లవాడు ఉండి ఉండి ఏడుస్తున్నాడు. వాడ్ని సముదాయిస్తున్న అరుణ గొంతు సన్నగా వినిపిస్తోంది. కొంచెంసేపటికి వాడు నిద్రపోయినట్లున్నాడు, నిశ్శబ్దంగా వుంది. అంతలోనే కలవరించిందల్లే

వుంది. ఎడపిల్ల ఏడవటం మొదలెట్టింది. ఆ ఏడుపులోనే ఏదో అంటోంది క్రాంతికుమార్‌కు విసుగుపుట్టింది. నిద్ర లేకుండా ఎంతసేపని పడుకోవటం? ఫ్యాను, లైటు తీసేసి తలుపు తీసుకుని వరండాలో కొచ్చాడు. అరుణ కూతుర్ని మాటలు చెప్పి నురపించాలని చూస్తోంది. ఆ అమ్మాయి వుండి వుండి 'కాంతి కాంతి' అంటోంది. అలా ఎందు కంటోందో, దాని అర్థమేమిటో అతనికి అవగాహన కాలేదు. అరుణను పిల్చి కనుక్కుందా మనిపించింది. అంత లోనే ఈ టైములో పిలిస్తే అరుణ ఏమనుకుంటుందో ననే భయంకూడా వేసింది. మళ్ళీ ఆ అమ్మాయి ఏడుస్తూ 'కాంతి కాంతి' అంది. ధైర్యంచేసి క్రాంతికుమార్ తలుపు వద్దను పోయి 'అరుణా' అని పిల్చాడు.

అరుణ తలుపు తీసింది. "ఎందుకు పాప ఏడుస్తోంది" అని అడిగాడు. "ఏమీలేదు కలత నిద్ర" అంది అరుణ. పాప ఏడ్పు చాలించింది.

"కాంతి అంటుందేమిటి"

అరుణ నవ్వింది. "వాళ్ళన్నయ్యకోసం కలవరిస్తోంది. మా పెద్దవాడిపేరు—క్రాంతికుమార్"

క్రాంతికుమార్ ఇక అక్కడవుండలేక తిరిగివచ్చాడు. తలుపులు గడియ వేసుకుని గదిలో పడుకున్నాడు. పైన సీలింగు ఫాను గిర్రున తిరుగుతోంది. అతని మస్తిష్కంలో అనేక విషయాలు సుళ్ళు తిరుగుతున్నై. అరుణ గురించి తను పొరబడ్డాడు. తనను, తన తోడి స్నేహాన్ని ఆమె

మరచిపోయి సుఖంగా కాపురం చేస్తోందని భావించాడు. కాని అరుణ మరువలేదు. ఆమె కుమారునికి తన పేరు పెట్టటంలోనే ఈ విషయం స్పష్టమాతోంది. కాని ఇప్పుడు ఈ క్షణంలో అరుణ మనస్సులో ఈ క్రాంతికుమార్‌ను గురించి ఎలాంటి ఆలోచన లున్నవో తెలుసుకోవా లనిపించింది.

క్రాంతికుమార్ గట్టిగా కళ్ళు మూసుకున్నాడు. కళ్ళతోపాటు తలపులతలుపుల్ని గూడ మూసుకుని నిద్ర పోవాలని. లేకపోతే మనసు పిచ్చి పిచ్చి కోర్కెల్ని కోరుతుంది.

కొన్ని నెలలక్రితం ఇలాగేజరిగింది. తను ఒక వ్యక్తిని గురించి ఆలోచించుకుంటూ కలలు కంటున్నాడు. ఆ క్షణంలో అదే వ్యక్తి అక్కడికి రావటం తటస్థించింది. కల యథార్థం కాబోయింది. కాని రవ్వంతలో తప్పిపోయి ఆ వ్యక్తి మాటలచే తన కనులు తెరిపి పడటం జరిగింది...

తలుపు దబ దబ బాదుతున్న చప్పుడుకు వూహల్లో నుండి తేరుకుని లేచి తలుపు తీశాడు క్రాంతికుమార్. ఎదురుగా అరుణ, క్రాంతికుమార్ విస్తుపోయాడు. ఏమిటిది? అరుణ ఎందుకు ఇలా వచ్చింది.? అర్థరాత్రి, ఏకాంతంగా వున్న స్త్రీ పురుషులు ... వెనుకటి అనుభవానికే సిగ్గుపడ్డ తనకు ఇప్పుడీ పరీక్ష ఏమిటి భగవాన్ !

"ఏమిటలా నిల్చుండిపోయారు? నిద్రరావటంలేదా?" అరుణ అడిగింది.

"ఉహుఁ"

"అవును మరి, ఎలా వస్తుంది" అరుణ నవ్వింది.

క్రాంతికుమార్ మాట్లాడకుండా నేల చూపులు చూస్తున్నాడు. అరుణ అక్కడ ఉన్న ఒక కుర్చీమీద కూర్చుంది. క్రాంతికుమార్ బిక్కు బిక్కుమంటూ చూశాడు ఇక్కడ బైఠాయిస్తుందేమిటా అని.

"ఏమిటలా భయం భయంగా చూస్తారు? మిమ్మల్నేమైనా మింగుతా ననుకున్నారా? అయినా మీకిలాంటి భయం పోవాలంటే వెంటనే మీ అమ్మగారికి ఒక కోడల్ని చూడాలి." అన్నది అరుణ.

క్రాంతికుమార్‌కు నవ్వు వచ్చింది. అరుణకు చిన్నప్పటి పరిహాసధోరణి పోయింది కాదు అనుకుని 'ఏమిటి అరుణా నీ పరిహాసం' అన్నాడు.

"పరిహాసమా! పెళ్ళి చేసుకోమని చెప్పటం పరిహాసమా" అంది.

"కాదనుకో. అయినా ఆ విషయాలన్నీ యిప్పుడెందుకు?" అన్నాడు ఎటో చూస్తూ.

"అవసరం వచ్చింది గనుకనే. మీరు శారదను పెళ్ళి చేసుకోవా లనుకోలేదూ?" అని సూటిగా ప్రశ్నించింది.

క్రాంతికుమార్ అప్రతిభుడైనాడు. తన నేరం బట్టబయలైన నేరస్తునిలా అరుణవేపు చూశాడు. ఆ విషయం ఈమె కెలా తెలిసింది? శారద చెప్పిందా? శారద చెప్పడానికి అవకాశంలేదే. అరుణ హాస్పిటలుకు వచ్చిన తక్షణమే శారద ఇంటికి వెళ్ళింది. మూడురోజులైనా మళ్లీ రాలేదు కూడా. 'నీ కెలా తెలుసు? అన్నాడు.

"యిలాంటి విషయాలు ఆడవాళ్ళకు మరొకరు చెప్పక్కర్లేదు. ఇట్టే కనిపెట్టేస్తాం" అంది అరుణ గర్వంగా.

నిజమేమో ననుకున్నాడు క్రాంతికుమార్ !

"నిజమేనా ?" అంది.

"నిజమే"

"మరి ఎందుకు చేసుకోలేదూ?"

"ఆమె కిష్టం లేకపోయింది."

"ఎందుకనో తెలుసుకున్నారా?"

"చెప్పలేను. బహుశా నేను తొందరపడి మొరటుగా ప్రవర్తించానేమో ననిపిస్తోంది. ఒకరోజు రాత్రి పది గంటల సమయం. నేను వరండాలో పడక్కుర్చీలో పండుకుని ఆలోచిస్తున్నాను. ఎవర్ని గురించో తెలుసా" అన్నాడు.

"నా గురించా" అరుణ నవ్వింది.

క్రాంతికుమార్ నవ్వుతూ "కాదు. శారదగురించి. శారద నా మనసులో చోటు చేసుకుంది. వృత్తిరీత్యా ఆమె నా వద్దనే ఉంటున్నా, ధర్మరీత్యా ఆమెని నాదాన్నిగా చేసుకోవా లనుకున్నాను. అలా ఆలోచిస్తూ పడుకుని ఉంటే శారద వచ్చింది. తను అర్జంటుగా ఏదో ఊరు వెళ్తున్నానని చెప్పటానికి, నా పర్సనల్ రూం తాళంచెవులు ఇచ్చి వెళ్లటానికీ. నా మనసులోని వూహాలు, కోర్కెలు ఆమెకు చెప్పి ఆమె ఆమోదాన్ని పొందుదా మనిపించింది. కాని, సంభాషణ ఎలా మొదలెట్టాలో తెలియలేను. తాళంచెవులను అందించిందిశారద. వాటిని నేను తీసుకో

కుండానే—ఇప్పుడు నీవుంటున్నావే—ఆగదిలోని టేబులు పైన పెట్టమని చెప్పాను శారద గదిలోకి వెళ్ళి వాటిని అక్కడ పెట్టుంటే నేను కూడ ఆ గదిలోకి వెళ్ళి 'శారదా' అని పిల్చాను. శారద భయపడింది. ఒక మూలకు ఒదిగి నిల్చుని 'ఏమిటి డాక్టర్?' అంది.

"శారదా! నీవు చాల తెలివైన దానివి. నే నెంతో మంది నర్సుల్ని చూశాను. కాని, అందరిలా కాకుండా ఏపనినైనా సూక్ష్మగ్రాహివై చేసుకుపోతూ నా మెప్పుకు పాత్రురాలివైనావు. అందుకనే నీకు ప్రమోషను ఇద్దా మనుకున్నాను" అన్నాను. "ఈ ఉద్యోగంలో ఇంతకంటే ప్రమోషను ఏముంది?" అంది శారద. "ఈ ఉద్యోగంలో కాదు శారదా! నిన్ను నా అర్ధాంగిగా చేసుకుంటాను" అన్నాను ఒక అడుగు ముందుకు వేస్తూ.

'డాక్టర్' అంటూ గర్జించింది శారద. "మీ రింకా మంచివారని అపోహపడ్డాను. పెద్ద మనుషులని మోసపోయాను. మీ కిలాంటి బుద్ధి పుడుతుందని నే ననుకోలేదు. ఒంటరి ఆడది కనుపిస్తే వెర్రి వెర్రి వేషాలు వేసే మీ జాతికి ఒక నమస్కారం. నాకీ ఉద్యోగమే వద్దు!" అంటూ వెళ్ళబోయింది. అప్పటికిగానీ నే నెంత తొందర పడిందీ తెలుసుకోలేకపోయాను. క్రాంతికుమార్ గా కాకుండా ఒక డాక్టరుగా రత్నంలాంటి నర్సును పోగొట్టుకుంటున్నానని అర్థమైంది. శారదను బ్రతిమిలాడాను. మరెప్పుడూ అలా ప్రవర్తించనని మాట యిచ్చాను...ఇప్పటికీ శారద అంటే ఒక విధమైన అభిమానం. ఆమె ఉంటే హాస్పిటల్లో నాకు

సగం పని తగ్గుతుంది. అంత తెలివిగలది ఆమె" క్రాంతి కుమార్ చెప్పడం ముగించాడు. అరుణ నిట్టూర్చింది.

కొంతసేపటికి ముఖంమీద నవ్వు తెచ్చి పెట్టు కుంటూ "ఒంటరిగా ఆడది మీ ఇంటికి వస్తే మీరు చేసే మర్యాద ఇదే నన్నమాట" అంది.

అరుణవేపు ఒకసారి చూచి తల వంచుకున్నాడు క్రాంతికుమార్. అరుణ అలా ఎందు కన్నదో అతనికి అంతుబట్టలేదు. సిగ్గుతో కుంచించుకపోయాడు !

అరుణ లేచింది. తలుపుదాకా వెళ్ళి మళ్ళీ వెనక్కు తిరిగి "చూశారా వచ్చిన పని మర్చిపోయి ఏవేవో మాట్లాడి వెళ్తున్నాను ? ... శ్రమ అనుకోకుండా నాకో చిన్న సహాయం చేస్తారూ, నాతో పాటు కొంచెం పోస్టాఫీసుదాకా వస్తారా ?" అంది.

"ఇప్పుడా ? అర్ధరాత్రి ... ఎందుకు ?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు.

"అవును. ఇప్పుడే అర్జంటుగా మావారితో ట్రంక్ ఫోన్‌లో మాట్లాడాలి. వారు ఇంటిదగ్గర ఉండేది ఈ సమ యంలోనే" అంది.

క్రాంతికుమార్ అమ్మను లేపి తాము పోస్టాఫీసుకు వెళ్తున్నట్లు చెప్పి పాపను, పసివాడ్ని కనిపెట్టి ఉండమని అరుణతో బయటకు నడిచాడు.

అనంతపూర్‌కు లైన్ దొరకటం ఆలస్యమైంది. రాత్రి పూట అరచార్జియే గదా అని ఎక్కువమంది ట్రంక్ ఫోను చేయడానికి రాత్రిపూట వస్తుంటారు. అందువల్ల మూడిం

టికి గాని లైను దొరకలేదు. అరుణ ట్రంక్‌ఫోన్‌లో మాట్లాడింది. ఆ మూడు నిమిషాల్లో ఎన్నో విషయాలు మాట్లాడింది. చివరకు పాప దాని అన్నయ్యకోసం బెంగ పెట్టుకుందని వెంటనే క్రాంతిని తీసుకుని బయలుదేరమని చెప్పింది. భర్తనుండి వస్తాననే సమాధానం వచ్చినట్లుంది. అరుణ ముఖం వికసించటం క్రాంతికుమార్ గమనించాడు.

వెన్నెల, మంచు ఒకదాని కొకటి పోటీలుపడి కురుస్తున్నై. వెన్నెల అరుణమీద పడి ఆమె సోయగాన్ని తనివి తీర త్రాగుతోంది. వెన్నెలతోపాటు చల్లగా ఉన్న మంచు వింతవాసనల్ని కల్గిస్తూ మత్తెక్కిస్తోంది. క్రాంతికుమార్‌లో ఏవేవో భావాలు చెలరేగాయి. ముందు నడుస్తున్న అరుణ భుజంపై చేయివేసి ఆపి "అరుణా నిన్నొక్క విషయం అడుగుతాను నిజం చెప్తావా?" అన్నాడు క్రాంతికుమార్.

"ఏమిటది" అంది తన భుజంమీద అతని చెయ్యిని తీసివేస్తూ.

"నిన్ను వివాహం చేసుకోలేక పోయినందుకు నాకిప్పుడెంతో విచారంగా ఉంది. ఫారిన్ వెళ్ళేముందు మీ నాన్న కోరినట్లు నిన్ను పెళ్ళిచేసుకుని మరీవెళ్ళేనే బావుండేదేమో, నావల్ల నీ జీవితం కూడ అనుకోని మలుపు తిరిగింది. నీవేం సుఖపడుతున్నావో!" అన్నాడు.

అరుణ కొద్ది క్షణాలు అతని కళ్ళల్లోకి చూసి నిద్ర మేల్కోటంవల్ల ఫారిన్ రిటర్న్‌డ్ డాక్టరుగారికి కొంచెం పైత్యం చేసినట్లుందే. లేకపోతే నేను సుఖపడకపోవట మేమిటి? నాకేం లోటని?" అని గొల్లున నవ్వింది.

క్రాంతికుమారు చిన్నబుచ్చుకుని ముందు నడుస్తున్న అరుణతోపాటు నడక సాగించాడు. ఆడవాళ్ళ మన స్తత్వం మీద బ్రహ్మాండమైన థీసిస్ రాసిన ఒకానొక వ్యక్తి చివరకి, ఒక చిన్న విషయాన్ని అర్థం చేసుకోలేక ఆడవారి మనసు అగాధం అని, వారిని గురించి తనకేమీ తెలీదని ఒప్పుకున్నాడుట ఒక కథలో. ఆ కథలో ఎంతో సహజత్వం ఉందని ఇప్పుడనిపించింది క్రాంతికుమార్‌కు.

తెల్లవారిందో లేదో, ఏదో గోల విన్పించి మెళుకువ వచ్చింది క్రాంతికుమారుకు. బద్ధకంగా లేచి కూర్చున్నాడు. ఎన్నో రోజులనుండి నిద్రలేనట్లు, కళ్ళు మెర మెర లాడుతున్నై. తల బరువుగా ఉంది. మెల్లగా లేచి గది బయటకు వచ్చాడు. అరుణ ఏడ్పు వినవస్తోంది. అప్పుడప్పుడూ సీతాపతిగారి గొంతుకూడ విన్పిస్తోంది. కంగారుగా వరండాలోకి వచ్చాడు క్రాంతికుమారు.

"రఘు కన్పించటం లేదురా" అంది అమ్మ కళ్లు ఒత్తుకుంటూ,

"కన్పించకపోవటమేమిటి? ఎక్కడికి వెళ్లాడు? ఎందుకు మీరంతా ఏడ్వటం?" కొంచెం కఠినంగానే అన్నాడు క్రాంతికుమార్. వాళ్ళంతా అనవసరంగా గలభా చేస్తున్నారేమోనని.

సీతాపతిగారు ఒక ఉత్తరం అందించాడు. క్రాంతికుమార్ గబగబా చదవటం మొదలెట్టాడు.

'మిష్టర్ కుమార్! నేనీవిధంగా అంతర్ధానం కావటం

మీకు ఆశ్చర్యాన్నే కల్గించవచ్చు. కాని నాకు తెలుసు, నే నిక్కడ ఉండటం నిష్ప్రయోజనమని. మీరు ఎంతగా దాచాలనుకున్నా నన్ను గురించిన మీ కలవరాన్ని నే గమనించక పోలేదు. నేను ముందుగనే నాజబ్బు నయం కాదని. మీరు పడే శ్రమ అంతా వృధా అని. ఆ సంగతి మీకూ తెలుసు. తెలిసికూడా నాకు తెలపకపోవటంలో మీ తప్పు లేదు. డాక్టరుగా అది మీవిధి. కాని మృత్యువు నాకు అతి సమీపంలో ఉందని తెలుసుకున్న నేను హాస్పిటల్లోని బెడ్‌కు అంటిపెట్టుకొని ఉండలేకపోయాను. కారణం నేను చనిపోయే ముందు చేయవలసిన ముఖ్యమైన పనులు రెండు ఉన్నై. ఒకటి మిమ్మల్ని క్షమాపణ కోరటం. ముఖాముఖిగా మిమ్మల్ని క్షమాపణ కోరే ధైర్యం లేకపోయింది నాకు. ఎలా ఉంటుంది మరి? నావల్ల మీకుటుంబంలోని వ్యక్తులు తీరని నష్టాన్నే పొందారు. రమను వివాహం చేసుకోమని నన్ను మీరు అడిగినప్పుడు నా సమాధానం మీకు ఎంతో బాధను కల్గించిందని నాకు తెలుసు. కాని నాలోని ఏదో దుష్ట శక్తి నానుండి ఆ సమాధానం చెప్పించింది. అంతే గాకుండా నిన్నే చేసుకోవాలనుకున్న అరుణకు మరో సంబంధం మాట్లాడాను. ప్రమాద వశాత్తు రమకు కల్గిన ఆ అవిటిదనం చూచి, నా మనస్సుని మార్చుకుని మీ ముగ్గురి ఆశాసౌధాల్ని ఎలాంమట్టిపాలుచేశానో అంతకంటే ఎక్కువఅంద విహీనత నా జీవితంలో ఎదురైంది నాకు. కాని అప్పటికీ తెలియలేదు అది నాకు శిక్ష అని. మశూచికంతో నా భార్య రూపు మారిపోయి అంద విహీనంగా తయారుకావటంతో ఆమెను తిరస్కరించి పుట్టింటికి బలవంతంగా వెడల

గొట్టాను. ఇంతకంటే క్రూరమైన, దారుణమైన విషయం ఉంటుందా? ఇంత ఘోరం చేసిన నాకు నిష్కృతి ఉందా? నన్ను క్షమించమని నా భార్యను కోరే హక్కు ఉందా నాకు? లేదు. నేనంతటి అదృష్టానికి తగను. కాని ఆమె క్షమా మూర్తి. నన్ను క్షమిస్తుంది. నా నుండి ఏ సుఖాన్నీ పొందలేక పోయినా నా యీ చివరి కోర్కెను తీర్చి నాకు శాశ్వత సుఖాన్ని, సంతృప్తిని కలిగించగలదు. అందుకే వెళ్తున్నాను. నాన్నకు, మీ అందరకు నా కడసారి నమస్కారం

—అభాగ్యుడు రఘు."

క్రాంతికుమార్ కళ్ళనుండి రెండు కన్నీటి బొట్లు టప టప రాలాయి. ఏమీ మాట్లాడలేక అచేతనుడై నిల్చుండిపోయిన అతనికి అరుణ మాటలు ఆశ్చర్యాన్ని కలిగించాయి.

"ఇంత జరిగిం తర్వాత ఇంకా వీడ్ని క్షమించడానికి ఆవిడ అక్కడుంటుందనే వీడి భ్రమ."

"ఏమిటమ్మా అరుణా నీవనేది? మీ వదిన పుట్టింటిలో ఉండటం లేదా ఇప్పుడు?" అన్నారు సీతాపతిగారు ఆశ్చర్యంగా.

"లేదు నాన్నా, ఆవిడ ఈఊళ్ళోనే ఉంది."

"ఈఊళ్ళోనా!?" క్రాంతికుమార్ ప్రశ్నించాడు. సీతాపతిగారు కళ్ళు పెద్దవి చేశారు.

"అవును ఈ ఊళ్ళోనే. మమ్మల్ని చూడగానే ఇంటి దగ్గర ఏదో పని ఉందని వెళ్ళి, మళ్ళీ తిరిగి రాని మీ శారద, మా వదిన" అంది అరుణ క్రాంతికుమార్ వైపు చూస్తూ.

వరండానిండా ఆశ్చర్యం ఆవరించింది. * * *

# మామూలు కథ

మామూలు కథ!

"ఏమిటోనండి. ఈ కాలంలో ఏ కథ చదివినా మామూలుగానే వుంటున్నది"—

ఇలాంటి కామెంట్లు మామూలైపోయాయి మరీ యీ రోజుల్లో. రకరకాల పత్రికలు చదివే పాఠకులు ఒకేరకపు కథలతో విసుగెత్తి మామూలుగా యిలాంటి వ్యాఖ్యానాలు చేయటం మొదలెట్టారు.

'ఇంతకీ ఏమిటండీ యీ మామూలు కథల గొడవ' అంటారా?

ఫలానా పట్టణంలో ఒక కాలేజీ. కో ఎడ్యుకేషన్ పద్ధతి అంతరించలేదు కాబట్టి ఆ కాలేజీలో అమ్మాయిలూ, అబ్బాయిలూ వుంటారు. అబ్బాయిలకొక రాజు, అమ్మాయిల కొక రాణి, "రాజు" వస్నీ కావ్యాలంకార సంగ్రహం లోని నాయక లక్షణాలైతే, అమ్మడు అచ్చు ప్రబంధ నాయిక. ఏదో సైకిల్ "డాష్" తోనో, నాటకాల పోటీ

తోనో, పుస్తకాల అభ్యర్థనతోనో బస్ స్టాప్‌లో పరిచయం తోనో ప్రారంభమౌతుంది వాళ్ళ ప్రణయగాథ. కాలేజీలో విద్యార్థుల గుసగుసలను, ఇంట్లో పెద్దవాళ్ళ రుసరుసలను లక్ష్యపెట్టక క్షణక్షణాభివృద్ధి పొంది తారాస్థాయి నందు కుంటుంది కథ. అక్కడో మలుపు. అనూంతం సుఖాంతం. ఇదొహ తరహా మామూలు కథ.

చిలకా గోరింకల్లాంటి నూతన దంపతులు యూనివర్సిటీవాళ్ళు కట్టబెట్టే అత్యధిక డిగ్రీ లుంటాయి ఇద్దరికీ. సిటీలో ఒంటరికాపరం ఆరంభిస్తారు ఇద్దరికీ వ్యక్తిత్వాలు ఆశయాలు, ఆశలు, ఆదర్శాలూ కూడా వుండటం సహజం. కాబట్టి నాగరికత పేరుతో స్వయం విహారాలు, అమ్మాయి ప్రవర్తన అబ్బాయికి నచ్చక పోవటం, ఏదేదో వూహించటం, అదీకాకపోతే మరో అనుమానం, దాంతో కుర్రాడేదో అనటం, మాటలమీద మాటలు విజృంభించి, చినికి చినికి గాలివానగా తయారవటం, ఇద్దరిలోనూ «అహం»తను మోతాదులో వుంటుంది కనుక, ఎవరూ మాటపడరు చివరికి అమ్మాయి కాస్తా పుట్టింటికి చేరటం, ఇక్కడ అబ్బాయి స్నేహితుడో, అక్కడ అమ్మాయి శ్రేయోభిలాషో, వాళ్ళ తప్పుల్ని వాళ్ళు తెలుసుకునేలా చేయటం. అంతే. నూతన దంపతుల పునస్సమాగమంతో కథ కంచికి చేరుతుంది.(కంచి కెందుకో?) యిదొహ రకం.

ఈమధ్య మరోరకం మామూలు కథలు యెక్కువైనై. వాటినిండా మాతృప్రేమలు, పితృప్రేమలు, మిత్రప్రేమలు మరేదో అనురాగం, త్యాగం గట్రా వుంటాయి.

ఇలా ఏకథ చూసినా మామూలుగానే కనపడుతూ ఉన్నది పాఠకులకు ఈ శోచనీయమైన పరిస్థితికి కారకు లెవరో మరి?

అసలుకథకు పైదంతా నాంది

మీరు చదవబోయే "మామూలుకథ"లో ఇలాంటి సంఘటనలంటూ వుండనే వుండవు. ఈ "మామూలు" అనే పదానికి అర్థమే వేరు అలాంటి అపురూపమైన "మామూలు" కథ వ్రాయటానికి మాకు చేతనైన రీతిగా సాహసం చేస్తున్నాం. అవధరించమని విజ్ఞులకు మనవి!

ఇది ప్రస్తావన.

ఇక, మాయొనర్పం బూనిన "మామూలు కథకు" కథన ప్రకారం బెట్టిదనిన —(కథలో కావ్యలక్షణా లేవీ వుండవు గాని భయపడి చదవటం ఆపేయకండి)

మనదేశంలోని అసంఖ్యాకమైన పల్లె పట్లలో అదొకటి. పేరేమిటని అడగక్కర్లేదు. రైల్వేస్టేషన్లో దిగితే, తుమ్మల్లోని కాలిబాటన మూడుమైళ్ళు ఆ వూరిదూరం. దేశ విదేశ రాజకీయాలు విచ్చలవిడిగా సంచారం చేసి ఆవూళ్లో రచ్చబండమీద ఉపన్యాసాలిచ్చే లచ్చయ్యగారి దగ్గరకు చేరతాయని అనుకుంటూ వుంటారు—ఆ గ్రామ ప్రజలు.

లచ్చయ్యగారు ఆవూళ్లో పుట్టి, ఆవూరి చెఱువులోనే యీతలుకొట్టి, ఆవూరి బళ్లోకల్లా పెద్దడిగ్రీ ఐన ఐదో తరగతిపట్టా పుచ్చుకుని, స్వయంగా ఒక ఎకరం పొలాన్ని పాతికచే గుణించి, "మోతుబరి" అనిపించుకుంటున్న ఘనుడు.

అంతటి మహాఘనత వహించిన లచ్చయ్యగారికి స్వవిషయాలు తప్ప మరేవీ తలకెక్కేవికాదు, నాలుగేళ్ళ క్రితం వరకు. ఆతర్వాతనయినా తప్పక ఇతర్లనిచూసి నేర్చు కొని, అలవాటు చేసుకున్నాడు, రాజకీయ పరిజ్ఞానాన్ని. అంతతప్పక పోవటానికి కారణమేమిటంటే - ఆయన్ని అమాంతం ప్రజలంతా కలిసి బలవంతాన పంచాయితీబోర్డు మెంబరుగా చేయటం. అలాంటి వాడ్ని అమాంతం అలా మెంబరుగా ఎందుకు చేశారో బహుశా ఆ ప్రజలకే తెలి యాలి. అప్పట్నుంచి రాజకీయాలు ఆయన దగ్గఱ చేరటం మొదలెట్టాయి. దాంతోపాటే ఆయన రచ్చబండమీాద ఉప న్యాసా లివ్వటంకూడా మొదలెట్టాడు. ఈయనగారి రాజ కీయాల ధోరణిని చూసి, తప్పదని ఆయనకి ప్రెసిడెంటుగిరీ కట్టబెట్టారు, ఓటరు మహాశయులు గడచిన ఎన్నికల్లో. లచ్చయ్యగారు ఆ వూరి పంచాయితీ ప్రెసిడెంటు యిప్పుడు.

మొన్న మొన్నటి వరకూ వూరి పొలిమేర దాటి (నారుకొనుక్కు రావటానికి తప్ప) బయటకు వెళ్ళని లచ్చయ్యగారు యిప్పుడనేక పనులమీాద పట్నానికి పోవాల్సి వచ్చింది. ఆయన కలాంటి అవసరం కలగటం వల్లనే, మాక్కీ కథ వ్రాసే అవకాశం కలిగింది.

ప్రెసిడెంటు కాగానే లచ్చయ్యగారికి గ్రామ ప్రజల అవసరాల్ని తీర్చాలనే సదభిప్రాయం కలిగింది. తొలి ప్రయ త్నంగా వూళ్లో రోడ్లు వేయించటానికి నిశ్చయించారు దానికి ముందు జరపవలసిన పద్ధతుల్ని గురించి భోగట్టా సేక రించారు లచ్చయ్యగారు. ఆ ప్రకారం బోర్డు తీర్మానాల

కాపీలను, సర్కారు ఉద్యోగికి పంపించారు ఎస్టిమేట్లు వేయమని ప్రార్థిస్తూ లేఖను జతబరచి మరీ. నెల గడిచిందిగాని, సదరు ఉద్యోగి నుంచి జవాబు లేదు. ఏదో పనిమీద పట్నానికి పోయిన లచ్చయ్యగారు ఆ వుద్యోగి ఆఫీసుకు వెళ్లాడు.

మర్యాదలైన తర్వాత చెప్పాడు ఆఫీసరుగారు "అదేమిటండీ వారం రోజుల క్రితమే మీ పనులు పూర్తిచేసి పంపానే" అని.

"రాలేదండీ" అని చూపులు ఆకాశానికి సారించారు లచ్చయ్యగారు, వాళ్ళ వూరి పోస్టు పంతులేమైనా గల్లంతు చేశాడేమోననే సందేహంతో.

ఉత్తరాలు రవాణాలో గల్లంతయినా, ఆ దోషం పోస్టుమాష్టరు పంతులుదేనని ఆవూళ్లో వాళ్ళందరి ఉద్దేశం. అదే అనుమానం లచ్చయ్యగారికి కలిగింది.

ఈయనగారి వాలకాన్ని గమనించి, ఆఫీసరే అన్నాడు "మరేం ఫర్వాలేదండి. పల్లెటూరు కదూ, చేరేసరికి ఆలస్యం కావచ్చు. రేపో మాపో వస్తాయి కాని, వాటిని తీసుకుపోయి పెద్దింజనీరుగారి ఆఫీసులో అప్రూవు చేయించుకోండి"

"వారి ఆఫీసుకు స్వయంగా వెళ్ళాలంటారా?" ధర్మసందేహం వెలిబుచ్చారు లచ్చయ్యగారు.

"చూడండి లచ్చయ్యగారూ. మీరుబాత్తిగా అమాయకులు. పైగా వ్యవహారాలు తెలియనివాళ్ళు. వెళ్ళకపోతే యెలాగవుతాయండి పనులు?"

వింతగా కళ్ళింతవి చేసి, నోరు తెరిచారు లచ్చయ్యగారు.

ఒక్క క్షణం ఆగి అదోలా పెదవి విరిచి "నా కొంచెం పనుంది. సెల విప్పిస్తారా" అంటూ లేచారు ఆఫీసరుగారు.

"చిత్తం... వెళ్లొస్తానండి" అనుకుంటూ బయల్దేరారు లచ్చయ్యగారు.

లచ్చయ్యగారు బయటకు రాగానే, వరండా స్తంభాని కానుకుని చుట్ట కాల్చుకుంటున్న జవాను చుట్ట ప్రక్కన పెట్టి లేచాడు. హడావిడిగా పైపంచె తలకుచుట్టుకుని, "వెళ్తున్నారా, ప్రెసిడెంటుగారూ?" అంటూ లచ్చయ్యని అనుసరించాడు.

రోడ్డుమీద కొచ్చారు ఇద్దరూ.

"ఏఁవిఁటోనయ్యా. వారంరోజులనాడు పంపిన కాగితాలు యింతవరకూ చేరలేదు నాకు." యధాలాపంగా అన్నారు లచ్చయ్యగారు.

తమాషాగా నవ్వాడు జవానుకాశిం. "అవన్నీ అంతేనండి. ఎవరొచ్చినా యింతే. చేసేసేనంటారు. అంతా అబద్దమే నయ్యా. ఏదో ఆరి మామూలారికి పడ్తేనేగాని కాగితంమీద కలమెట్టరు."

నిధినిక్షేపాల రహస్యాన్ని బయల్పరుస్తున్న వాడిలా నెమ్మదిగా అన్నాడు కాశిం.

"మామూలా!" లచ్చయ్యగారు "కొశ్చన్ మార్కు" మొహం పెట్టారు.

"ఆఁ. మామూలేనండీ. ఏదో మీకు తోచినంతిస్తే చాలు. బాగా తింటం ఈ అయ్యగారి కింకా తెలవదు."

"మామూలేఁవిఁటయ్యా?"

"అదేనండీ... మామూలే"

కాశిం కొంచెం హెచ్చు స్వరంలో హెచ్చరించే సరికి అర్థమైంది లచ్చయ్యగారికి. తనలో తను 'ఓహో',అను కుని "అయితే యిప్పుడే యిచ్చి పొమ్మంటావా" అన్నారు.

"అఖ్ఖర్లేదులెండి. ఈసారి మిమ్మల్ని చూస్తామన్నా రని నే చెప్తాలెండి అయ్యగారికి. ఎల్లుండీపాటికి ఎస్టిమేట్లు మీకందుతయ్. ఆఁ...". మాటల్లోనే తనపలుకుబడినంతా చూపిస్తున్న జవాను కాశింను చూసి ఆశ్చర్యపోయారు లచ్చయ్యగారు.

"చూడు కాశిం, జీతాలు పుచ్చుకుంటూ మీరు చేయాల్సిన పనికే యిలా మామూలు, మామూలంటే ఎలాగయ్యా!"

"అదేంటి బాబూ, అలాగంటారు. జీతమని పేరేగానీ వచ్చే నాలుగురాళ్ళు బియ్యం, నూకలకే చాలటంలేదు గదండి. రోజులు మీకు తెలీనివా? ఏదో మీలాంటివారు కనిపెట్టుండక పొతే యీ ఉద్యోగాలతో బతకటమేనా?"

"నిజమే కాబోలు" అనిపించింది? లచ్చయ్యగారికి. "సరే వస్తానోయ్, నువ్వుండు" అంటూ అడుగు ముందు కేశారు.

"ఇంతకీ నా మామూలు సంగతేఁవిటంటారు; కాఫీ కన్నా డబ్బుల్లేవయ్యా. ఏదో మీదయ" చేతులు నలుపు కుంటూ వెంబడించాడు కాశిం.

ఒకసారి కాశింను తీక్షణంగా చూసి, చొక్కా గుండీలు వూడదీసి లోపలి జేబులోనుంచి రూపాయినోటు తీశారు లచ్చయ్యగారు.

దాన్ని చూసి కాశిం మొహం కళ మార్చుకుంది. "ప్రెసిడెంటుగారూ! ఓ హా శ్రమన్నా లేకుంటే..." అని నసిగాడు.

"పర్వాలేదులే కాసీవయ్యా. పని పూర్తయ్యేలోపల ఎన్నిసార్లు రావాలోకదా. నువ్వా కాగితాలు వచ్చేటట్లు చూడు. నే నెక్కడికి పోతాను. యీ సారి వస్తాగా" అంటూ నడక సాగించారు లచ్చయ్యగారు.

"సరే... కానీండి. మీ దయ" అనిదణ్ణంపెట్టి వెనక్కు తిరిగాడు కాశిం.

లచ్చయ్యగారి రోడ్డు నిర్మాణ వ్యవహారంలో యిది తొలిమజిలీ. తెల్లవారి లేచినప్పట్నుంచి రాత్రి పడుకోబోయే వరకూ గొడ్డుచాకిరీ చేసే జీతగాడికికూడా కూలి డబ్బులకు పైన కానీ ఇచ్చి ఎరుగని ఆయన, యిలా మామూలివ్వటం మొదలెట్టాడనే వార్త యెవరికి ఆశ్చర్యాన్ని కలిగించదు చెప్పండి? కాశిం మాట్లాడుతూ వుంటే అదంతా సబబే అనిపించివుంటుంది. అందుకేనేమో ఏటిసిరు పల్లానికి పారుతుందంటారు. ఎంతటివాళ్ళయినా అవసరానికి లొంగక తప్పేదేముంది?

ఇంటికి చేరుకున్న లచ్చయ్యగారికి ఆలోచనమీద ఆలోచనలు ముసిరినయ్, ఋణదాతను ముసురుకునే అప్పుల వాళ్ళలా.

"కాశింలాంటి వాళ్ళకు యిచ్చే మామూళ్ళన్నీ ఏ ఖాతాకు ఖర్చురాయాలి?" అనేదే పెద్ద సమస్య అయింది ఆయనకు. రికార్డులో యిలాంటివి రాయటానికి వీల్లేదు. రాయకుండా చేతిసొమ్ము ఎంతని ఖర్చుపెట్టగలడు తను. ఇలాగైతే తనకొచ్చే ఆదాయం యీ మామూళ్ళకి చాలదు. ఈ ఆపదల్ని మిగతా ప్రెసిడెంట్లిలా తప్పించుకుంటారో తెలుసుకోవాలనుకున్నాడు. తీరా ఆ పద్ధతి తెలుసుకునేసరికి, వెధవది "కాన్షస్" అంటారే, అది అడ్డు తగిలింది. తన కింతవరకూ యితరుల్ని మోసగించి సంపాదించటం, తిమ్మిని బమ్మి చేయటం చేతకాదు. అలాంటివాడికి సంవత్సరంలో అయ్యే అదనపు కర్చులన్నీ చూచుకొని ఏవో నాలుగు పనుల్లో కలిపిరాయటంకన్నా గత్యంతరం లేదని చెప్తే శాధ కదూ మరి.

గ్రామస్థుల అవసరం తీర్చటానికి ముందు పని పూర్తయితే తర్వాత చూసుకొందాం యీ విషయాలన్నీ అనుకొని అప్పటికా ఆలోచనవిరమించుకొన్నారులచ్చయ్యగారు.

మూడోనాటికల్లా కాశిం చెప్పిన ప్రకారం వచ్చినయ్. ఎస్టిమేట్లు (రిజిష్టరుడు పోస్టులో!)

ఇప్పుడు పోయి ఆ ఆఫీసర్ని "వారం క్రితమే పంపానంటిరే" అని అడిగితే ఏఁవంటాడో అనిపించింది లచ్చయ్యగారికి. అంతలోనే "ఆఁ ఏఁవంటాడు. మొహం మాడదూ" అని పైకే అనుకుని సంతృప్తి పడ్డాడు సన్నని నవ్వుతో.

"ఏఁవిఁటి లచ్చయ్యబావా, ఏదో నీలో నువ్వే నవ్వుకుంటున్నావ్" అంటూ తయారయ్యాడు సుబ్బయ్య.

"ఆఁ ఏంలేదు సుబ్బయ్యా. రోడ్డుపనులకు ఎస్టిమేట్లు చేయించాను. పెద్దింజనీరుగారి ఆఫీసుకుపోయి అప్రూవు చేయించుకు రావాలి...ఏం నువ్వూ వస్తావా యేం. నాకూ భోత్తిగా వ్యవహారం అర్థంకావటంలేదు. ఎట్టయినా నీ బుర్ర కాస్త పెద్దదిగందా" అన్నారు లచ్చయ్యగారు, కొయ్యకుర్చీలో పైకి జరిగి.

"ఇదిగో చూడుబావా, రావటానికి నాకేంఅభ్యంతరం లేదు. కాకపోతే మామూలు ఖర్చులు నువ్వే భరాయించాలి. ఆనక నీయిష్టం. అంత్య నిష్ఠూరం కంటే ఆది నిష్ఠూరం మేలని ఇప్పుడే చెప్తున్నా" నిర్మొహమాటంగా చెప్పి చుట్ట కొరికి తుపుక్కున వుమ్మాడు సుబ్బయ్య.

"ఆరి నీ దుంపతెగ. నీకూ మామూలే!" అనిపించి ఆశ్చర్యంగా సుబ్బయ్య వైపు చూశాడు లచ్చయ్యగారు.

"అవునుమరి. మామూలు విషయాలకు ముసుగులో గుద్దులాటంటే నాకసలే గిట్టదు" కనుబొమ్మ లెగరేశాడు సుబ్బయ్య.

ఒక్క క్షణమాగి నెమ్మదిగా అడిగారు లచ్చయ్యగారు. "అయితే సుబ్బయ్యా, ఈ మామూలు ఖర్చులన్నీ ఏ ఖాతాలో రాయాలంటావ్?"

"ఏ ఖాతాలో రాయాలో తెలీకపోతే పెదరావూరు ఖాతాలో రాయి బావా!" హేళనగా అని నవ్వాడు సుబ్బయ్య.

ఈ మాటలకి మన ప్రెసిడెంటుగారికి చిరాకూ వేసింది; కోపమూ వచ్చింది. "నీ సలహా బాగుంది కాని,

ప్రొద్దున్నే యిటే వచ్చినట్లున్నావ్ కాస్త కాఫీ తెప్పించనా సుబ్బయ్యా. తాగి పోదువుగాని ఆఁహాఁ పర్వాలేదులే. పెద రావూరు ఖాతా వుండనే వుందిగా, అలాంటి ఖర్చులకి" అన్నారు.

సుబ్బయ్య మొహం మాడ్చుకుని వెళ్ళిపోయాడు.

*                    *                    *

తన మామూలు ఖర్చులక్రింద, ఆఫీసులో మామూలు ఖర్చులకూ పాతికరూపాయలు భద్రంగా కాగితంలో పొట్లాం కట్టుకున్నారు లచ్చయ్యగారు. దాన్ని లోపలిజేబులోపెట్టుకుని, పైచొక్కా బొత్తాములు ఒకటికి రెండుసార్లు జాగ్రత్తగా చూసుకుని మళ్ళీ పట్నానికి బయల్దేరారు. ఇతఃపూర్వం వారు వెళ్ళిన పట్నమొక తాలూకా కేంద్రమైతే, ఈ పట్నం జిల్లా ముఖ్యపట్టణం.

పెద్దింజినీరుగారి ఆఫీసులోకూడా జవానే విషయాలన్నీ వివరించాడు. లచ్చయ్యగారికి. పని త్వరగా పూర్తి చేసుకుని పోవాలనుకుంటే, నెరవేరాల్సిన కనీసకర్తవ్యాల్ని జాగ్రత్తగా విన్నారు; లచ్చయ్యగారు.

తత్ సందర్భంలో బయల్పడిన గొప్ప విశేషమేమిటంటే – ఏ పని జరగాలన్నా ఆఫీసులో ఫైళ్లు ఒకచోటినుంచీ మరోచోటికి జరగాలనీ, అలా జరగటానికి ముందు లాగుడో వెనుక తన్నుడో వుండాలనీను.

ఈ పారిభాషిక పదాలకర్థం తెలియక తెల్లమొహం వేసిన లచ్చయ్యగారిపై కొన్నిలీటర్ల సానుభూతి ప్రదర్శించి వాటి అర్థం వివరించాడు సదరు జవానే.

ముందు లాగుడంటే యీ "మామూలు" తాడును పేనటమట. వెనక తన్నుడంటే పలుకుబడి పడికట్టురాళ్ళతో మొట్టడమట ఈ రెంటిలో ఏ పద్ధతీ యెరగని వ్యక్తులకు సంబంధించిన కాగితాలు ఏ ఆఫీసులోను అరంగుళం మేర జరగవనేది యీ (కలి) కాలంలోని సూత్రమట. చూశారా మరి! ఇంతకుపూర్వం లచ్చయ్యగారికి తెలియని విషయా లెన్ని వున్నాయో యీ వ్యవహారాలలో!

జవాను తెలియజేసిన విషయాలన్నీ విని బిత్తరపోయి, తత్తరపడి కుండలో నీళ్ళు సత్తు గ్లాసెడు త్రాగి తెప్పరిల్లు కున్నారు లచ్చయ్యగారు. మరోమారు త్రాగాలనిపించింది. కాని, కుండలో నీళ్ళు లేవు. 'ఈ మామూళ్ళకు పోయా లంటే, డబ్బుకూడా అంతే కాబోలు!

ఇంతకీ ఇంజనీరుగారి ఆఫీసులో లచ్చయ్యగారి కాగి తాలు అన్ని రకాలైన ముద్దర్లు గ్రుద్దించుకోవాలంటే, యమ కింకరుల్లాంటి నలుగురి బల్లలమీద నుంచి జరగాలని తెలిసింది.

ఆ ఆఫీసంతా పరమపద సోపాన పటంలా కనిపిం చింది, ఆయన గారికి. ఆట పూర్తి చేసుకుని బయట పడా లంటే ఎన్ని పాముల్ని దాటాలి? దానికితోను నిచ్చెనలేవీ లేవు.

అందులో మొదటి వ్యక్తి - అదేదో నోరు తిరగని పేరు... ఏదో 'మన్న'ట. లచ్చయ్యగార్ని ఆయన దగ్గర కూర్చో పెట్టాడు జవాను. ప్రొద్దున పదిన్నరనుంచి 'సజ్జెను'

అని రాసి, అలాగే వుంచిన డ్రాప్టుల్ని ప్రక్కకి నెట్టి, ఆప ద్బాంధవుడైన శ్రీ మహావిష్ణువును చూసిన గజేంద్రంలా, లచ్చయ్యగారిని చూశారు. 'గుమాస్తా' బురఖాలో దాక్కున్న, చాలీచాలని జీతంగాళ్ళు.

సదరు 'మన్ను' గారేవేవో పెద్ద పుస్తకాలు తిర గేసి, ఎస్టిమేట్లమీద అక్కడక్కడా ఎర్రసిరా మరకలు చేసి ముద్దర వేశారు. ఈ శుభ సందర్భంలో లచ్చయ్యగారి చొక్కా అడుగు జేబులోని పొట్లంలో దాక్కున్న పది రూపాయల కాగితానికి స్థానచలనం కలిగి బల్లఅడుగునుంచి సదరు ఉద్యోగి పంట్లాం జేబులోకి దూరింది.

ఈ కర్మకాండ జరిగేసరికి 'లంచి' టైమయింది.

'కాఫీ తాగొద్దామండీ' అన్న ఉద్యోగుల ఆత్మా రాముళ్ళ ఆర్తారావాల నాలకించిన వాడై లచ్చయ్యగారు వెంట ఆరుగురు వ్యక్తులు తోడురాగా కాంటీన్‌కు బయల్దే రారు, ఆముదం త్రాగిన మొహం పెట్టుకుని. కాంటిన్‌లో ఉద్యోగుల 'విట్'లకు మధ్య మధ్య 'అహహ' అంటూ తెచ్చికోలు నవ్వును ప్రదర్శించలేక ఆయనగారు యమబాధ పడ్డారనే చెప్పాలి. అరగంట గడిచేసరికి మూడు మూళ్ళ (3—33) సంఖ్య కలిగిన బిల్లు లచ్చయ్యగారిని వెక్కిరిస్తూ వారి ముందు ప్రత్యక్షమైంది. ఐదురూపాయల కాగితం తీసి ప్రక్కనే వున్న హోటల్ మేనేజరు కిచ్చాడు బిల్లుతోసహా. ఆశాల్తీ చిల్లర ఇచ్చేలోపుగానే, "భమ్మయ్యా! ఆ చిల్లర తీసుకుని సిగరెట్లు, కిల్లీలూ పట్రావోయ్"అని లోపల్నుంచీ కేక. లచ్చయ్యగారా ధ్వన్యనుకరణకు ప్రక్కకుతిరిగేలోగా

భ్రమ్మయ్య నాబడు జవాను చిల్లరతీసుకోవడమూ అయిపో యింది; బయటకు వెళ్ళటమూ అయిపోయింది.

శాల్తీలన్నీ సీట్లల్లోకి చేరుకుని "ఉస్సురు" ని భుక్తా యాసం తీర్చుకోవటం మొదలెట్టాయి.

ప్రెసిడెంటుగారి గుండెల్లోదడ ప్రారంభమైంది. తెచ్చిన డబ్బు అయిపోతున్నదికాని, పని కావటంలేదనే బెంగ, రాత్రికి వుండాల్సివస్తే ఎలా అన్న భయం ఆయన్ని ఉక్కిరి బిక్కిరి చేస్తున్నై.

మరో అర్ధగంట గడిచేసరికి మరో ఇద్దరు గుమాస్తాల దగ్గరనుంచి విముక్తి పొందినై కాగితాలు. జవాను సలహా ప్రకారం వారిద్దరికీ కలిపి మరో హస్తం చెల్లించుకున్నారు. "మామూలు" క్రింద – వారు, అభ్యర్థించకుండానే. అందుకే ఆయన్ని ఆపద్బాంధవుడిగా "ట్రీట్" చేశారు. గుమాస్తాలు!

ఇక్కడ ప్రారంభమైంది లచ్చయ్యగారి చిక్కు. నాలుగో కింకరుడు లచ్చయ్యగారి జేబు ఖాళీ కావటం పసి కట్టాడో యేమో, మామూలు చేతిలో పడితేనేగాని, కలం చేతపుచ్చుకోనని మొండి కేశాడు. లచ్చయ్యగారేమో తన బాధ తను వెళ్ళపోసుకున్నాడు.

"అదిగాదండి. ఊరికే 'సైడ్ ఇన్‌షల్స్' వేసే బచ్చాగాళ్ళందరికీ ముందుగా జమ కట్టి, అసలు పనిచేసే వాడికి నాకే టోకరా కొడ్తే ఎలాగండి. పైగా పిల్లాడికి పుస్తకాలు కొనాలి కూడా యివాళ. ఇదేం లాభంలేదండీ ప్రెసిడెంటుగారూ. అసలు లోకమే యిలాగుంది లెండి..."

అని సదరు నాలుగవ శాస్త్రీ తన ఆవేదనని వెళ్ళబోసు కుంది రుద్ధ కంఠంతో.

ప్రెసిడెంటుగారు చేసేది లేక బయటకొచ్చి "అన్యథా శరణంనాస్తి..." అని జవాన్ని సహాయం కోరారు.

అతనేం తక్కువ తిన్నాడా "సరి సరి. ఇది మరీ బాగుంది. అసలువాణ్ణి నాకే లేకుండా వాయిదా వేస్తున్నారే. ఇలా చేస్తారనుకుంటే యింతెందుకు చెప్పేవాణ్ణి. చేసేవాణ్ణి." అని ఒంటికాలుమీద లేచి, ఒక మార్గం సూచించాడు, "డబ్బు పుచ్చుకుని మళ్ళీ రేపుర"మ్మని.

గత్యంతరం లేని పరిస్థితులు సంభవిస్తే ఎవరైనా ఏం చేయగలరు చెప్పండి? కర్తవ్యం తోచక దిగులుపడి కొంపకు చేరారు లచ్చయ్యగారు.

మోకాలు లోతు బురదరోడ్డుమీదే నడవటానికి అలవాటుపడిన లచ్చయ్యగారు ఎట్టకేలకు ఈ "మామూలు" కార్యక్రమానికి దాసులై రోడ్డు పని ప్రారంభించారు. రాత్రింబవళ్లు లారీల్లో క్వారీలచుట్టూ తిరిగి సరుకంతా రోడ్డు మీదికి తోలించారు. అప్పటికి చేతిలో డబ్బు అయిపోవటంతో "పార్టు బిల్లు" కోసం బయల్దేరారు. మళ్ళీ "మామూలు" కథ మామూలే కదా! ఈసారి పూర్వం కన్నా పెద్ద మొత్తాలు వదిలినయ్. ఎందువల్లనంటే జీపు డ్రైవర్ల దగ్గర్నుంచి, పెద్ద పెద్ద ఘటాల వరకూ తృణం కాకుండా పణం సమర్పించుకోవాల్సి వచ్చింది. అదీకాక

మరో రెండు ఆఫీసుల బెడద ఎక్కువైంది. అందులో ఒకటి ప్రభుత్వంవారి గ్రామ్ఫోను కార్యాలయం. ఇక్కడ మరో రకం "మామూలు"ను చవిచూశారు లచ్చయ్యగారు. తను తీసుకుపోయిన బిల్లుమీద వూరికే ఆఫీసు ముద్ర కొట్టినందుకు జవానుకు మామూలు. సొమ్ము చెల్లించమని రాసిన గుమాస్తాకు వరహా మామూలట. ఇక మూడవ శాస్త్రీ ఆఫీసుకు పాయాలోకే వస్తాడు. ఆయనగారి "మామూలు" కేవలం ధనరూపంలోనే కాకుండా, మరే వస్తురూపంలోనైనా వుండ వచ్చునట. అందుకని వారి మామూలు కోర్కె "ఇంటిముందు బురద యెక్కువగా వుంటున్నది. ఒక అరలారీ కంకర సప్లయి చేయండి" అనేది.

దీనికి కాలవ్యవధి వుందికదా అని అర్ధాంగీకార సూచనగా మౌనంతో బయటపడ్డారు లచ్చయ్యగారు.

పోతే రెండవ ఆఫీసు "బ్యాంకు". ఇక్కడికి మాత్రం ఈ జాడ్యమింకా వ్యాపించక పోవటంతో, ఒక గంట ఆలస్యమైనా, సవ్యంగా సొమ్ము తీసుకుని యింటికి చేరారు లచ్చయ్యగారు.

ఆ రోజు రాత్రి...——.

ఆరుబయట పండువెన్నెల్లో పడుకున్న లచ్చయ్య గారి కళ్ళముందొక పెద్ద భూతం నాట్యమాడసాగింది. తను యింతవరకూ (సొంత ఖర్చులు కాకుండా) ఖర్చు పెట్టిన సొమ్ము అక్షరాలా పదిహేను వందల అరవైమూడు రూపాయల అరవైఏడు నయాపైసలు కాగా, తన చేతికి

వచ్చిన సొమ్ము పదకొండువందల తొంభైరూపాయల డెబ్బై ఒక్క నయాపైసా మాత్రమే. ఈ రెండంకెల తేడా, మూడు వందల డెబ్బైరెండు రూపాయల తొంభై నయా పైసలే, యిప్పుడాయన ముందున్న పెనుభూతం.

"మొత్తం రోడ్డుపనిలో మూడవవంతు ముగియక ముందే యిలా ఉంటే, పూర్తయేసరికి చేతిసొమ్ము యెంత వదుల్తుందో ?"

ఈ ఆలోచన కలిగేసరికి శరీరమంతా చెమటలు పట్టింది. లేచి కూర్చుని పైపంచెతో మొహం తుడుచుకున్నాడు.

ఇంతలో నెమ్మదిగా ప్రవేశించాడు సుబ్బయ్య, "ఏం లచ్చయ్యబావా పడుకున్నట్టున్నావే ?" అనుకుంటూ.

"ఊఁ" లచ్చయ్యగారు నీరసంగా అన్నారు.

"ఏంటి బావా సంగతులు ?" – సుబ్బయ్య అరుగు మీద చతికిలబడుతూ ప్రశ్నించాడు.

"ఏమున్నయ్ సుబ్బయ్యా! రోడ్డుపనిలో యిప్పటి కప్పుడే నాలుగొందలు నష్టమొచ్చింది." హీన స్వరంతో విచారంగా అన్నారు లచ్చయ్యగారు.

"అంతే బావా ! మోసేవాడికిగానీ తెలీదు బరువు" అని ఒక్క క్షణం తటపటాయించి "సరేగానీ బావా ! మా పెద్దోడు ఆ మెట్రిక్ కాస్తా గట్టెక్కాడు గందా. ఏదో చేతికింద కొస్తాడని చూస్తున్నా. మన సమితిలో

ఖాళీ వుందట. కాస్త ఆ ప్రెసిడెంటుగారికి చెప్పి సాయం చెయ్యాలి బావా" అంటూ వచ్చిన పనిని వెళ్ళపెటాడు సుబ్బయ్య.

కొద్దిసేపు ఆలోచించారు లచ్చయ్యగారు. ఉవరి కెలాగో అన్నారు – మాటలు కూడబలుక్కుని. "చూడు సుబ్బయ్యా! చేతనైన సాయం చేయటానికి నాకేం అభ్యాంతరం లేదు...కాని..."

"కానీ ఏంటి? చెప్పు బావా!"

"నా మామూలు నువ్వే భరించాల్సి వుంటుంది. ఆనక నీ యిష్టం. అంత్య నిష్టూరం కంటే ఆది నిష్టూరం మేలుకదా అని ముందే చెప్తున్నా" అంటూ మంచంమీద వాలారు లచ్చయ్యగారు.

"అబ్బ! ఎంత 'మామూలు'గా నా మాట నాకు అప్ప జెప్పాడు లచ్చయ్య బావ – అనిపించిందేమో సుబ్బయ్యకు. అలా అనిపించటం కూడా మామూలే మరి.



# అంతరాంతరం

శారద చంద్ర చంద్రికలు ధాత్రీ మహాదేవి మేని యందానికి వింత చందం కూరుస్తున్నాయి.

గుడిసెలో బహు దగ్గరలో పడుకున్న వారిద్దరూ ప్రక్కకు వత్తిగిలేరు. అసంకల్పంగా ఒకరి కొకరు ఎదు రెదురైనారు.

డొంక కిరువైపుల — పచ్చని పట్టు తివాచీ పరచిన ట్లున్న ఒక పంటచేను, మసాణివంటి ఒక చౌటి బీడు. వాటి ఉనికిలో వ్యత్యాసం అతి స్వల్పం. ఔన్నత్యంలో అంతరం మాత్రం అనల్పం.

సంబరం పొంగులు వారి తలపూపి ఉప్పొంగిపోవల సిన సమయంలో — చలనంలేక అంతస్సంచలనానికి తల వంచి సతమత మవుతున్నది పసిడి పసి హృదయం.

ప్రపంచపు రణగుణ ధ్వనుల్ని లక్ష్యంచేయక ఆద మరచి నిద్రించవలసిన ఆ బుడుతడి చిరుకన్నులు— చింత

నిప్పులుగా వేయి మరుత్తు లోకశై వెలిగినట్లు వెలిగిపో తున్నాయి.

గోవిందు మనస్సు కళ్ళెం లేని గుఱ్ఱమైంది.

"తాత తనకీ పేరు పెట్టినప్పుడే పళ్ళు నూరేడంట అయ్య. ఊఁ—. నూరకేం చేస్తాడు ?— రోజూ గేదెల్ని నరకటానికి కత్తి నూరటంలో మొనగాడు గదా ?. తాత చేసింది పెద్ద తప్పని అప్పుడే తనని చంపేస్తా నన్నాట్ట.

"ఆడు నా పేణం. ఆణ్ణి చంపాలంటే ముందుగా నన్ను మట్టు పెట్టాలిరా" అని తాత కళ్ళురిమితే సప్పబడినా డంట—చేతగాని దద్దమ్మ !

తాత మాత్రం తక్కువ తిన్నాడా ?—

తనకు సదువుకునే ఈడొచ్చాక 'ఆడికి ఉరుదూ చెప్పిస్తే నే చస్తానని' మోడీకేసిండు. 'ఉరుదూ అంటే ఏంది తాతా ! అంటే, 'అదేరా, మీ అయ్యా, అమ్మ మాట్లాడే బాస' అన్నాడు.

ఆ బాసలో తనకి 'మా — బాబా' అని రెండు మాట లొచ్చినందుకే కసురుకుంటాడు తాత. "నువ్వాళ్ళు మాట్లాడే మాటలు యినిపించుకోకు చిన్నా" అని బుద్ధులు చెప్పి తనకా బాస రాకుండా సేశాడు. ఇదీ అయ్యకు పడలేదు.

అస లిదనేంద లే?— తనంటే అయ్యకు కసి. తనను తెలుగు బళ్లో ఏసినప్పుడూ పెద్ద బాగోతం చేసింద్రు— అయ్యా, ఆడి ముఠా.

అయితే ఏం ?— తాత తన పంతం గెల్చాడు. లేక పోతే తనిప్పుడెట్టా "రెండు" సదువుతూ ఉంటాడు. ఆరి దీని యబ్బ! మళ్ళీ సదువు అనే వచ్చిందే. సదువు అన గొళుదురా "చదువు" అనాలని ఆ నత్తి మేష్టారు చెప్పారుగా. ఆయనకు "డు" రాదు. పాపం. డు ఎక్కడొచ్చినా "ళు" అంటూ వుంటారు. బలే మేష్టార్లే!

సణుగుడు తాత్కాలికంగా సద్దుమణిగి సన్నని చిరు దరహాసరేఖ విరిసింది—గోవిందు అధర పల్లవంమీద. తల క్రింద పెట్టుకున్న కుడిచేయి తిమ్మిరెక్కింది. నెమ్మదిగా తీసి బాగా విదిలించాడు. ఎదురు మంచంమీద గురక పెడుతూ ఉన్న తండ్రివైపు చూచాడు.

"చూడు ఎంత లావు చేతులో — తుమ్మ మొద్దుల్లాగా. పేణం పోయేటట్టు కొట్టాడు." గోవిందు ముఖం కోపంతో కందగడ్డలా అయింది. చేత్తో వీపు నిమురుకున్నాడు. ఈత బెత్తపు వాతలు చేతికి తగిలేయి. ఏడుపు ముంచుకొచ్చింది. పెదవులు కంపించి కళ్ళ నీళ్ళు తిరిగినై.

"పాడు మనిసి. ఆయేల అమ్మనీ యిట్టాగే. ఛా... ఛా...ఇట్టాగా ?—ఇంతకంటే జాస్తిగానే చితకబాడిచిండు. అమ్మ తప్పేం ఉంది. తాగొచ్చి చావ బాదాడు గాని, అసలీడిబుద్దేఇంత-" అసహ్యంతో చూపులు మరల్చుకున్నాడు.

బయట వీస్తున్న యీాదరగాలి తన శాఖను గుడిసె లోకి పంపింది. చలికి అల్లాడిపోయేడు, గోవిందు. జారి

పోయిన పొట్టి లాగూ, పైకి పోయిన చొక్కా సరిచేసుకున్నాడు. కాళ్ళు రెండూ ముడుచుకుని, చేతులు పొట్టలో పెట్టుకున్నాడు. వీపు వెనక్కు జరిగి తాతకు కొట్టుకుంది.

"ఏందిరా" అంటూ కదిలేడు ముసలితాత.

"ఏంలేదు తాతా. చలిగా ఉంది." అని కళ్ళు మూసుకున్నాడు గోవిందు.

పై గుడ్డను నిండుగా కప్పి, గోవిందును కౌగిలించుకున్నాడు తాత.

పులకింపజేసే స్పర్శ!

అనూహ్యమైన ప్రేమాలింగనం!

"ఈడి చేతు లిరగ. గొడ్డును బాదినట్టు బాదినాడే. వాతలు తేలాయి. ఈడి కోపం నాశనం కానూ. నేనుంటే నరికేవాణ్ణి నాయాల్ని" అని గోవిందు వీపును ఆప్యాయంగా నిమిరి మీద చెయ్యి వేసేడు తాత.

తాత సానుభూతి మాటలు గోవిందు హృదయానికి అమృతపు జల్లులై కరగించినై. అతని కను కొలకుల్లో నిలిచిన బాష్ప బిందువులు కొల్ల కొల్లలుగా వెల్లుబికినై—స్నిగ్ధ కపోలాల మీదగా జారి పారినై.

సెకన్లు పెరిగి నిముషాలైనాయి.

ఆ కన్నీటిధారలు చారలు కట్టినై—అతని చెక్కిళ్ళ నునుపుకు మాలిన్యాన్ని పులుముతూ.

ఆతని మానస సాగరంలోని తీవ్ర ఘోష తిరిగి విజృంభించింది.

"తాత అన్నట్టు నిజంగానే గొడ్డును కొట్టినట్టు కొట్టిండు. తనెంత సెప్తున్నా యినుకుంటేగా. "నాకేం తెలవదు బాబా" అని బ్రతిమాలుకున్నా వదల్లేదు. ఆఖరికి భయంతో లగెత్తినా ఎంటబడి కొట్టిండు—మద్దెలో వచ్చినందుకు అమ్మకూ తగిలినై. పాపం! అమ్మకు నొప్పిగా లేదేమో? నిద్దరోతోంది."

"లేకపోతే.........

అలవాటై ఉంటుంది! - అంతే."

"అసలీ రబసంతకూ నాయాలు ఆ ఖాన్‌గాడు కదూ కారణం. ఆడి పని రేపు చెప్తాలే" గోవిందు పెదవులు బిగిపడినై.

"వాసుకోసం ఆ దొరగారింటికి పోదాం. తోడు రారా" అని బతిమాలితే వెళ్లాడు గానీ లేకపోతే తనకేం పని. వచ్చిన ఎదవ సరిగా తిరిగిరాక, ఎదవపని చేశాడు దొంగనాయాలు!

ఈడు తియ్యమంటే ఆళ్ళింట్లో బల్లమీంది గడియారం ఏమైపోద్ది. పెద్దయ్యగారు అప్పుడే ఆకులుచి లోపలికెళ్ళారంట. ఆ ఎంటనే తామే గదా ఆడకి పోయింది. ఆడే తీసుంటాడు, ఖాన్‌గాడి దసలు దొంగబుద్దే. బల్లో ఎన్నెన్ని నూక్కుపోతుంటాడో తనకు తెలీకుంటేగా. కంతిరిగాడు.

"ఆడే తీసుంటాడు మొర్రో, నాకు తెలవదని ఎంత మొత్తుకున్నా యినకుంటేగా— అయ్య" "కాదు. నువ్వే

తీసుంటావ్, ఏడ పెట్టావో చెప్పు"మని రెండు ఈత బెత్తాలు యిరగ్గొట్టాడు.

అంతే. ఏం తెలీనోడికే ఈ కాలంలో తన్నులు. ఛా ఈళ్ళకసలు ఖాన్కిముల్లే దొంగలే కావాలె. నాదే తప్పు"

తాత చేతిని పక్కకు తీసేడు గోవిందు. కదలకుండా పడుకున్నాడు ముసలాయన. గోవిందు పరీక్షగా తాత మొహంలోకి చూసేడు. ఆయన అన్నమాటలు అతని చెవుల్లో మార్మోగినై—"ఈడి కోపం నాశనంకానూ ?"

గోవిందు తండ్రివైపు కోపంగా చూశాడు. "అయ్య కోపానికి అంతులేదు. ఏ యిసయానికైనా అట్టాగే చంపుతాడు, మనుసుల్ని. ఇదివరకోసారి చిన్నోడు 'మరీ ఇది'గా ఏడుస్తుంటేనూ అంతే. ఆణ్ణి నాలుగు బాది, తొడ పిసికిండు. గిలగిల్లాడిపోయేడు వాడు. ఆనక తెలిసింది, ఆడికి కందిరీగ పీకిందని. పాడు అయ్య! ఇప్పుడు తననూ అంతే. చెయ్యని తప్పుకు ఎన్ని కొట్టిండో." గోవిందుకు ఉక్రోషం పొంగింది.

కళ్ళు చేరెడు చేసుకుని చూడసాగేడు. తండ్రివైపు. అతని మనస్సులో ఎన్నెన్నో ఊహలు కలగా పులగంగా అల్లుకో సాగేయి.

లేచి కూర్చున్నాడు.

"నేనుంటే నరికేవాణ్ణి నాయాల్ని"- తాత పలుకులు చెవుల్లో గింగురుమన్నాయి.

అతని హృదయంలో రగులుతున్న పగ రాజుకుని పావకజ్వాలలై జ్వలించింది.

"నేనుంటే నరికేవాణ్ణి నాయాల్ని—"

"...నరికేవాణ్ణి నాయాల్ని"

"... ... నాయాల్ని"—

గోవిందు పళ్ళు పటపట కొరికాడు. గుప్పిట బిగించి లేచాడు. అతని క్రోధాగ్నికి సాయంగా ఝంఝూమారుతం వీచింది.

ప్రశాంత నిశి—అశాంత మనస్కుడు.

లోకం నిద్రాదేవి ఒడిలో విశ్రాంతి పొందుతున్నది–శోకం, క్రోధం అతనిలో తారస్థాయి నందుకున్నవి.

తడబడుతున్న అడుగులతో, అల్లల్లాడుతున్న మనస్సుతో గుడిసె మూలకు వెళ్లాడు.

మృత్యువు ముడుచుకు కూర్చున్నదా మూల!

బలవంతంగా యీవలకు లాగేడు! భారంగా అతని కట్టెదుట నిలబడింది—పొట్టేళ్ళను కొట్టే పొట్టి కత్తి!

శక్తిని కూడదీసుకుని రెండు చేతులతో ఎత్తి పట్టుకున్నాడు. మానవత్వంలోని పశుత్వానికి ప్రేరేపణ కలిగింది. విజృంభించి మానవు నొక త్రోపు తోసింది.

గోవిందు తండ్రి మంచం ముందు కొచ్చేడు. క్రోధారుణిత నేత్రాలతో తండ్రిని చూసేడు. కథలలోని రాక్షసరూపం కళ్ళముందు నర్తించింది, గోవిందుకు.

పెదవులు బిగబెట్టి కత్తి నెత్తాడు.

దూరంగా ఊర కుక్క గీపెట్టి శోకించింది.

ఫర్లాంగు దూరంలోని రోడ్డుమీద పోతున్న లారీ హారన్ ధ్వని చెవుల్లో గింగురుమన్నది.

ప్రక్కనున్న పక్కమీది తాత ప్రక్కకు తిరిగేడు

దీపపు గుడ్డి వెలుగులో చచ్చిన బల్లి పిల్లను చీమలు లాక్కుపోతూ, గోవిందు కాలును కుట్టెనై.

తల్లి ఒడిలో పడుకున్న పసివాడు కెవ్వుమన్నాడు. తల్లి యీ వైపుకి తిరిగి పిల్లడ్ని జోకొట్టసాగింది.

గోవిందు శరీరం చిరుగాలికి వూగే తీగలా ఐంది. అటు యిటు తూలిపోయేడు. చేతిలో కత్తి క్రిందపడి మట్టిలో ముద్దలా కూరుకుపోయింది.

నిలకడ తప్పిన గోవిందు నిట్టాడి తాటి బొందుకు కొట్టుకున్నాడు. మొహం గిరుకుపోయింది. 'మా' అంటూ మూలిగి క్రింద పడ్డాడు.

కళ్లు తెరచి చూసేసరికి—

తలమీది బొప్పిని అరచేతితో నిమురుతున్న "అయ్య" వడిలో పడుకుని ఉన్నాడు—గోవిందు.

గంప క్రింది పిల్లకోడి తల్లి రెక్క క్రింద ముడుచుకుంది.



# అభాగ్యుని అంతిమయాత్ర

చివరి బస్సుకూడా తప్పిపోవటంతో తన దురదృష్టాన్ని నిందించుకోక తప్పలేదు—రామకృష్ణకు.

బయలుదేరిన వేళావిశేషం ఈ విధంగా దెబ్బతీసి కొట్టడం మనసుకు కష్టంగా తోచినా, చేసేదేమీ లేక వెనుదిరిగి నడవటం మొదలెట్టాడు. అతనికి వెంటనే ఎదురైన సమస్య "ఎక్కడికి వెళ్ళటం"; రేపు వుదయం ఏడింటి వరకూ ఎలా గడపటం?" అనేది.

తనకు తెనాలి కొత్త కాకపోయినా, వెళ్తే అతిథి పూజలు చేసి ఆదరించే మిత్రులెంతోమంది వున్నా స్వతహాగా ఒకరింటికి వెళ్ళే తత్వం కాదు తనది, అదీగాక ఆ సమయంలో ఎవరో వొకరింటికి వెళ్ళి వాళ్ళని యిబ్బంది పెట్టటం ఎందుకులే అనుకుని ఏదోవిధంగా ఆ రాత్రి గడపాలని నిశ్చయించుకున్నాడు.

ఏడున్నర గంటలైంది.

"మరో రెండు గంటలు గడిపితే ఏదైనా సినిమా చూడవచ్చు. సినిమా అయ్యేసరికి ఏ రెండో అవుతుంది. అప్పుడే మారిసుపేట సత్రంలోనో, రైల్వే స్టేషనులోనో కన్ను మూసుకుంటే ఎంతలో తెల్లవారుతుందిలే" అనిపించింది. "ప్రొద్దుటే అయినా మొదటిబస్సు తప్పిపోకుండా జాగ్రత్త పడాలి, లేకుంటే పెందలకడ యిల్లుచేరే యోగం వుండదు" అని తన్నుతాను హెచ్చరించుకున్నాడు అంతలోనే.

ఇలా ఆలోచించుకుంటూ వంతెన మీదకు చేరాడు రామకృష్ణ. అక్కడనుండి మెయిన్ బజారుకు వెళ్ళే రోడ్డొకటి కొత్తవంతెనమీదుగా రామలింగేశ్వరపేట పోయే రోడ్డొకటి వున్నై. ఎటు వెళ్ళటమా అని మనసులో మధనపడుతున్న రామకృష్ణకు ఎదురుగా సినిమా పోష్టరు కనిపించింది. "స్వరాజ్య టాకీస్‌లో ఫలానా సినిమా" ఆ సినిమా బాగున్నదని పుదయం తను ప్రయాణం చేసిన బస్సులో ఎవరో చెప్పుకోవటం తాను విన్నాడు. ఆ బాగేమిటో చూడాలనే కుతూహలం మనసును ఆవరించగా కొత్త వంతెన వైపు నడక సాగించాడు రామకృష్ణ

ఒకవైపు కృష్ణానది నీటిని పంటచేలకు కొనిపోయే పంటకాల్వ, మరోవైపు సరుకుల రవాణా సౌకర్యాలకు పడవలు నడిచే "పడవల" కాల్వ. మధ్య రోడ్డు. ఆ రోడ్డులో ఫర్లాంగు దూరంలో రెండు వంతెనలు – పాత వంతెన, కొత్తవంతెన. రోడ్డు పొడుగునా మెర్క్యురీ లైట్లు

ఇంతవరకు పల్లెపట్టులను, అక్కడి ప్రకృతి సోయగాన్ని వర్ణించి వ్రాయటమే అలవాటు చేసుకున్న రామకృష్ణకు పట్టణాల్లోని మానవ నిర్మితమైన కృత్రిమ వాతావరణంలోకూడా అందం లేకపోలే దనిపించింది.

రామకృష్ణ కవి కాకపోయినా అంతో ఇంతో రచనా వ్యాసంగాన్ని అలవర్చుకున్నవాడు. చాలామంది రచయితల హృదయాలవలె అతనిహృదయంకూడా నవనీతం. ఏమాత్రం వేడి సోకినా కరిగే గుణంకలది. అంతేగాక రచయిత హృదయం—నే నేమీ పట్టించుకునే అవసరంలేదని కళ్లు మూసుకుని ముందుకు సాగలేదు. పరిసరాలను పరికిస్తుంది. అందాన్ని, ఆనందాన్నీ చూసి సంతోషిస్తూ సాగిపోతుంది. దైన్యాన్ని, దుఃఖాన్నీ చూచి జాలిని ప్రకటిస్తూ కుంటి నడకలు నడుస్తుంది.

రామకృష్ణ ప్రక్కనున్న కాల్వలలో ప్రతిబింబిస్తున్న విద్యుద్దీపాలను, ఆకాశాన్ని ఏకచ్ఛత్రాధిపత్యంగా పాలిస్తున్న చంద్రుణ్ణి, అక్కడక్కడ మినుకు మినుకుమనే తారకల్ని చూస్తూ నడుస్తున్నాడే కాని, అతని హృదయం మాత్రం కాలువగట్టున నివసించే కొందరు దీనుల దురదృష్టాన్ని గురించి ఆలోచిస్తూనే వుంది.

వంతెన మీదనుంచి దూకుడుగా దిగివస్తున్న సైకిల్ రిక్షా మ్రోతతో వులిక్కిపడి ఈ లోకంలో పడ్డాడు రామకృష్ణ.

అతని చూపులు అక్కడే వున్న వొక దృశ్యంమీద

నిలిచినై. పది పదిహేనుమంది ప్రోగయి ఏదో వింతగా చూస్తున్నారు. రెండు ఆడ గొంతుకలు హృదయ విదారకంగా ఏడ్పును ప్రసారంచేస్తున్నై. ఒక మగ వ్యక్తి చేయి చాచి అక్కడ చేరినవాళ్ళను, దారినపోయే వాళ్ళను ఏదో యాచిస్తున్నాడు. చూడటానికి దృఢంగానే వున్నాడతను.

'ఏదైనా పనిపాట చేసుకుని పొట్ట పోసుకోక యీ అడుక్కుతినటం ఎందుకో. ఛీ. ఛీ. దేశంలో సోమరితనం యింతగా ప్రబలిపోతోందేం. కాకపోతే ఏమిటది? అవిటివాళ్లూ అడుక్కు తినటమే; కాయకష్టం చేసుకొనేందుకు జవసత్వాలున్న ఇతనిలాంటివాళ్లూ అడుక్కోవటమేనా' అనుకున్నాడేగాని అక్కడికివెళ్ళి అసలు సంగతి తెలుసుకోవాలనే కుతూహలాన్ని, అవసరమైతే సహాయం చేద్దామనే ఉదారతను అణుచుకోలేక పోయాడు రామకృష్ణ.

వంతెనకు దగ్గరగా కాలువ గట్టుపైన వొక వ్యక్తి పడుకుని వున్నాడు. అతనికి ఆపాదమస్తకం తెల్లటి గుడ్డ కప్పబడివుంది. ఆ వ్యక్తి చనిపోయివుంటాడని, అందుకే ఆడవాళ్ళిద్దరు విలపిస్తున్నారని తెలుసుకోవటానికి ఎంతోసేపు పట్టలేదు రామకృష్ణకు. అంతటితో సంతృప్తిపడక పక్కనున్న తోటి ప్రేక్షకులను వివరాలడిగాడు రామకృష్ణ. ఆ చనిపోయిన వ్యక్తి ఒక రిక్షావాలా అని, ఏడ్చే ఆ ఆడంగులలో ఒకరు తల్లి అని, మరొకరు భార్య అని లైటు స్తంభాని కానుకుని కూర్చున్న ఆరేళ్ళ పిల్లవాడు, అతని చేతిలో వున్న మరో పసికందు అతని పిల్లలనీ తెలిసింది.

సహజంగా ఈ రిక్షావాలాలకు మరో ఆధరవు వుండదు. ఎంత సంసారమైనా వాళ్ళ రెక్కల బలం మీద ఆధార పడవలసిందే. కాకపోతే ఆడవాళ్ళు రెండు మూడు కుటుంబాలకు పనిపాటలు చేసిపెడుతూనో, లేక బడి పిల్లలకు క్యారియర్లు మోసిపెట్టూనో, తమ కొచ్చే ఆదాయాన్ని సంసారానికి వెచ్చిస్తూ వుంటారు — వేడి నీళ్ళకు చన్నీళ్ళతోడుగా. కాని, యీ మరణించిన వ్యక్తి భార్య ఒక కాలులేని అవిటిది. తల్లి జరాభారంచేత జవసత్వాలుడిగిన అభాగిని. అలాంటి కుటుంబ పోషకుడు మరణిస్తే—

ఆ స్థితి ఎంత హృదయవిదారక మైనదో కళ్ళారా చూశాడు రామకృష్ణ. "ఆ కుటుంబానికి ముందుముందెలా గడుస్తుంది? ఆ పసికూనలు ఎలా బ్రతికి బట్ట కట్టారో కదా?" అని బాధగా మూలిగాడు రామకృష్ణ 'లోని' మనిషి.

"ఎట్టాగైనా ఈ కట్టె కడ తేర్చాలిగదా బాబూ... తోచింది ధర్మంచెయ్యండి బాబూ!" యాచిస్తున్న నడి వయస్కుడు డబ్బా నొకదాన్ని చేత పుచ్చుకుని గలగల లాడిస్తూ జనంచుట్టూ తిరుగుతున్నాడు. ఎవరికి తోచినదాన్ని వాళ్ళు డబ్బాలో పడేస్తున్నారు.

"చచ్చినవాణ్ణి తగలేయటానికి కూడా గతిలేని దరిద్రం" — ఎవరో అన్నారు పహ్యంగా.

"అంతేబాబూ. ఏం చేస్తాం చెప్పండి. రిక్షా యజమాని రిక్షాను షెడ్డులో పెట్టించుకుని నేనేం చేయలేను పొమ్మన్నాడు" బాధగా చెప్పాడు ఆ యాచించే వ్యక్తి.

ఆదుకొనే సత్తా వున్నా, ఆదుకుందామనే సద్బుద్ధి లేనివాళ్ళు కొందరైతే, ఆ సద్బుద్ధివున్నా శక్తిలేని వ్యక్తులు కొందరుంటారు. ఈ రెండవర్గాలకు చెందినవాళ్ళలో ఒకడైన తోటి రిక్షావాలా మిత్రుని శవాన్ని ఆ రోడ్డుపైనేవుంచి, ఆ శవదహనానికి కావలసిన ఖర్చులకు ధర్మబుద్ధి పరాయణుల్ని విత్తరూప సహాయానికి యాచిస్తున్నాడన్నమాట.

రామకృష్ణ గట్టిగా నిట్టూర్చాడు. ఇంత గట్టిగా నిట్టూర్చిన ఈ వ్యక్తి గొప్పగానే ధర్మం చేయవచ్చుననే ఆశతో గాబోలు ఆ యాచించే వ్యక్తి రామకృష్ణముందుకు వచ్చి డబ్బా గలగల లాడించాడు.

రామకృష్ణ హృదయం కలత చెందింది.

"ఇంతమంది వ్యక్తులు యీ దారిన వెళ్తూ ఒక్కరైనా అయ్యో పాపమని తగినంతగా ధర్మం చేయలేకపోయారే. అతిథి అభ్యాగతుల ఆదరణకు పేరుమోసిన భారతదేశంలో; శాంతి, సత్యా హింసల పునాదులతో బ్రహ్మాండమైన గౌరవ సౌధాలను నిర్మించుకుంటున్న భారత సమాజంలో; మనమంతా ఒక్కటి, బీదా - గొప్పా అనే భేదంలేదని చాటే వ్యక్తులెవ్వరూ యీ అభాగ్యుని అంతిమ యాత్రకు తగిన సౌకర్యాలను, సహాయాన్ని చేకూర్చలేక పోయారే" అని రామకృష్ణ అంతరాత్మ ఘోషించింది. ఇలాంటి నిర్భా

గ్యాల్ని ఆదుకోని సంఘపు నాగరికతాభివృద్ధిని మనసులోనే నిదించాడు, ఆవేశం వుప్పొంగిపోగా.

కాని, అతని చేయిమాత్రం జేబులోకి వెళ్ళలేదు ! అలాగని నిరాదరణతో అతను అక్కడినుండి కదలిపోనూ లేదు. అలాగే నిలబడి చూస్తూ వుండిపోయాడు. ఆ యాచించే వ్యక్తి యితని వాలకాన్ని చూచి అక్కడినుంచి తప్పుకున్నాడు.

ఒక అరగంట గడిచింది.

గుమిగూడిన వారిలో కొంతమంది జారుకున్నారు. ఆడంగుల గొంతులు మూగబోయినవి కాబోలు, అప్పు డప్పుడు మాత్రం ఎవరైనా దారిన వస్తూ పోతుంటే మూలుగుతున్నాయి. స్తంభానికి ఆనుకుని కూర్చున్న ఆరేళ్ళ కుర్రవాడి వొడిలోని పసికందు ఎప్పుడో నిద్ర పోయింది. ఆ కుర్రవాడుకూడా ఆకాశంవేపు చూస్తూ "చల్లనిరాజా వో చందమామ" అంటూ కూనిరాగం తీస్తున్నాడు.

రామకృష్ణకు నవ్వొచ్చింది, జాలీ వేసింది.

పాపం ! తమకు "నాన్న" అంటూ యిక లేడని, తమ భవిష్యత్తు బాధల మయమని తెలుసుకోలేని ఆ పసి హృదయాల అమాయకతకు జాలివేసింది. "చీకు – చింత, మంచి – చెడు, చావు – బ్రతుకు అంటే ఏమిటో అర్థం కాని వయస్సు వాళ్ళది" అనుకున్నాడు రామకృష్ణ.

ఏడుపు మానిన ఆ ఆడవాళ్ళు ఏదో మాట్లాడు కుంటున్నారని గ్రహించిన రామకృష్ణ ఆలోచించటంమాని,

వారి మాటల్ని వినాలని ప్రయత్నించాడు. వినపడటమైతే వినపడింది గాని ఆ మాటలు అర్థంకాలే దతనికి. ఆ భాష వేరు. తనకు ఇంగ్లీషు, తెలుగు, అరవం, హిందీ తెలుసు గాని, వాళ్ళు మాటాడేది యీ నాలుగు భాషలో ఏ భాషా కాదు.

ఆ స్త్రీల మాటల్ని విన్న మగవ్యక్తి యాచించటానికి మరెవ్వరూ కనుపించక ఆడంగులవద్ద జేరి డబ్బాలో వున్న చిల్లర డబ్బుల్ని తీసి వొక గుడ్డమీద పోసి లెక్కపెట్టడం మొదలెట్టాడు. "వచ్చిన డబ్బులు చాలు. ఇక జరగవలసిన పని చూడు" అని వాళ్ళని వుంటారని వూహించాడు రామకృష్ణ.

డబ్బులు లెక్కించిన ఆ వ్యక్తి "ఐదు" అన్నాడు తెలుగులోనే. ఆ రేళ్ళ కుర్రవాడు ఆత్రంగా వచ్చాడు చిల్లర పోసిన గుడ్డవద్దకు.

ఆ స్త్రీలు ఐదు అన్నమాట విని నిస్పృహ చెందినట్లు ఆ గుడ్డి వెలుగులో కనిపెట్టాడు రామకృష్ణ. "ఔను మరి. ఐదు రూపాయలు ఏ మూలకు?" అనుకున్నాడు తనలో తాను. "ఇంకెంత కావాలి?" — రామకృష్ణ ఆ వ్యక్తిని అడిగాడు.

ఇంతవరకూ అడిగినా 'ధర్మం' చేయకుండా యిప్పుడు ఇంకెంత కావాలని అడిగే యీ వింత వ్యక్తి—రామకృష్ణ—ను ఎగాదిగా చూశాడా వ్యక్తి. కొన్ని క్షణాల వరకూ బదులు చెప్పలేక పోయాడు. చివరకు "మరో పదన్నా

లేకపోతే గడవదు సార్" అన్నాడు ఎంతో దీనంగా, వినయంగా చేతులు కట్టుకు నిలబడి.

రామకృష్ణ ప్యాంటు జేబులోంచి పర్సుతీసి పది రూపాయల నోటును ఆ వ్యక్తి కందించాడు. అయాచితంగా, ఆకస్మికంగా ఇంత డబ్బు ధర్మంగా దొరుకుతుందని అనుకోని ఆ వ్యక్తి, స్త్రీ లిరువురూ గ్రుడ్లప్పగించారు ఆశ్చర్యంతో.

కొంతసేపటికి తేరుకొని యిక ప్రయాణ సన్నాహాలు చేయటం మొదలెట్టారు. పది నిముషాల్లో నాలుగు కర్రలు సంపాదించి వాటితో వొక వాహనం తయారుచేసి దానిపైన మరణించిన వ్యక్తిని పరుండబెట్టి మోసుకు పోవటానికి ఉద్యుక్తులైనారు.

ఇంతలో ఎవరో వ్యక్తులు వాళ్ళదగ్గర కొచ్చారు. జడదారుల్లా వున్నారు వాళ్ళిద్దరూ. వస్తూనే "అంతా సిద్ధం చేసివచ్చాం. ఇక పోదాం పదండి" అన్నారు ఆ యాచించే వ్యక్తితో. అతను "సరే" అంటూ లేచాడు. కాని, మరణించిన వ్యక్తిని మోసుకు పోవటానికి వాళ్లు ముగ్గురే అయినారు. నాలుగో వ్యక్తి లేడు. అక్కడ రామకృష్ణ కాక నలుగు రైదుగురు వ్యక్తు లున్నారు. అంతా వింతగా చూస్తున్నారు. రామకృష్ణ ముందుకు వచ్చి "నాలుగో ప్రక్క నే నుంటాను రండి" అన్నాడు.

ఆ వ్యక్తులు, స్త్రీలు బిక్క మొహాలు వేశారు. ప్రేక్షకులు గుసగుసలాడారు.

"తప్పు బాబుగారూ, తమరు గొప్పోరు. మీ రిలా అనకూడదు. ఇప్పటికే చాలా ఋణపడ్డాం" మొదటి యాచకుడు యిలాంటి మాటలేవో అంటూ వుండగానే జడదారులిద్దరూ దగ్గరిలోవున్న పాకపాకలోకి వెళ్ళి మరోవ్యక్తిని పిలుచుకొచ్చారు.

ఆడవాళ్ళిద్దరూ కడసారిగా ఏడుపు సాగించారు.

"మీరిక కొంపకు పదండి; మేమూ వస్తాం, పని పూర్తిచేసుకుని" అని ఆడవాళ్ళతో చెప్పి, ఆ నలుగురు వ్యక్తులు శవాన్ని తీసుకొని బయల్దేరారు.

శవాన్ని మోసుకుని కొంతదూరం సాగారు వాళ్ళు. అప్రయత్నంగా రామకృష్ణకాళ్ళు వాళ్ళు వెళ్ళినవేపే నడిచినై. అతనితో మరో నలుగురు కూడా వందగజాలు నడిచి వాళ్ళని సాగనంపి ఒక్క రొక్కరుగా జారుకున్నారు.

జంపని కాలువ వంతెన దగ్గర పడింది. రామకృష్ణ వాళ్ళ వెనుకగా నడుస్తున్నాడు. అతని మనస్సులో అనేక భావాలు ఇట్టే మొలచి మాయమవుతున్నై.

'పుట్టటం – గిట్టటం రెండూ ఒకే దారపు రెండు కొనలు. ఆ దారపు పొడవు ఎంతో ఎవరికీ తెలియదు. ఎక్కడైనా అంతం కావచ్చు, లేక ఎప్పుడైనా పుటుక్కు మన వచ్చు. అందుకని పుట్టుకను, గిట్టుటను ఒకే చిత్త ప్రవృత్తితో చూడగలిగిన వాడే నిజమైన వేదాంతి. శిశువు జీవితంలో ఎన్నో కష్టాల్ని ఎదుర్కొనాలనే సత్యాన్ని విస్మరించి, శిశువు పుట్టగానే వుప్పొంగిపోయి, భవబంధాలను త్రెంచుకుని, మరణ మనే పేరుతో యిహలోక విముక్తి నొందుతున్న

అదృష్ట జీవిని చూచి ఏడవటం సామాన్య మానవలక్షణం— అంటారు విజ్ఞులు.'

శవాన్ని దింపి తన రాకను ఆశ్చర్యంతో చూస్తున్న ఆ నలుగురి వ్యక్తుల్ని చూచి రామకృష్ణ తన ఆలోచనలకు స్వస్తి చెప్పాడు.

"ఎందుకు ఆగారు?" అని ప్రశ్నించాడు.

కొద్ది నిముషాలు జవాబుకై తడుముకొని "దింపుడు కళ్ళాంఆశ బాబూ" అన్నాడు ఒక జడదారి.

'అవును మరి. మనిషి మరణించినా ఆశ చావదు. మరికొన్ని క్షణాలలో బూడిదగానో, మట్టిగానో మారిపో బోతున్న మృత శరీరం సజీవమై లేచివస్తుందనే ఆశ! ఈ ఆశ మానవుడిని ఎంతటి పిచ్చివాణ్ణిగా చేస్తున్నది' అను కున్నాడు రామకృష్ణ.

రామకృష్ణ కిప్పుడు స్మశాన వేదాంతం బాగా తల కెక్కింది.

ఆ నలుగురూ మళ్ళీ తమ పనిని కొనసాగించబోతూ అన్నారు. "బాబూ – తమరిక వుండండి. ముందంతా గుట్టలు, తుప్పలూ, ముళ్ళూ. పురుగు, పుట్రా వుంటాయి. చీకటి గాఢాంధకారం పైగా."

రామకృష్ణ ఒకసారి ముందుకు చూచి 'నిజమే' అనుకుని ఆగిపోయాడు. వారు నలుగురూ శవాన్ని మోసు కుంటూ సాగిపోయారు వంతెన దాటి.

వెనుదిరగ బోతున్న రామకృష్ణకు మళ్ళీ ఏదో అను మానం కలిగింది. "పాపం. వీళ్ళు నలుగురే వెళ్ళుతున్నారు.

మరొకరి సహాయం ఏమైనా కావలసి వస్తుందేమో. ఈ గుట్టల్లోను, తుప్పల్లోను, పురుగూ పుట్రా వున్నా కొంచెం వోర్చుకుంటే వారికి అవసరమైతే సహాయం చేయవచ్చు. చచ్చి స్వర్గానికి వెళ్తున్న ఆ జీవి ఎంతో శాంతి పొందుతాడు"

ఈ ఆలోచనే రామకృష్ణను ముందు సాగిపోయే వాళ్ళకి కనపడకుండా వారి ననుసరించేలా చేసింది. 'వాగు చూస్తే తను కష్టపడటం సహించలేక వాళ్ళు తనను వెనక్కు వెళ్ళిపొమ్మనవచ్చు, అప్పుడు తను సందిగ్ధావస్థలో పడాలి' అనే సందేహామే కాక, ఆ మృత శరీరాన్ని దహనం చేస్తారో, భూస్థాపితం చేస్తారో కూడా చూచి పోదామనే కుతూహలం కలిగిందతనికి.

రామకృష్ణకు, ముందుకు సాగిపోయిన వారికి అర ఫర్లాంగుదూర మేర్పడింది. కదులుతున్న ఆకారాలుగా మాత్రమే ఆ వ్యక్తులు గోచరిస్తున్నా రతనికి.

చుట్టు ప్రక్కల కీచురాళ్ళ సంగీత స్వరాలు. వుండి ఉండి ఏదో పిట్ట ఏడుస్తున్నట్టు అరుస్తున్నది.

కొంతదూరం వెళ్ళిన తర్వాత ఆ నలుగురూ తాము మోస్తున్న శవాన్ని దింపారు. రామకృష్ణ ఒక చెట్టును చాటు చేసికొని చూస్తున్నాడు. వాళ్ళేం చేస్తున్నదీ సరిగా కనుపించక పోవటంతో మరికొంచెం ముందుకు వెళ్దామని కదల బోతుండగా, వాళ్లు తనవేపే నడిచి రావటం గమనించాడు రామకృష్ణ.

కాని—— —— కాని—— ——!

రామకృష్ణ గట్టిగా కళ్లు నులుముకుని మళ్ళీ చూశాడు. సందేహం లేదు.

ఆ వచ్చే వ్యక్తులు ఐదుగురు!—

నడిచి తనవైపే వస్తున్నారు. రామకృష్ణ గిచ్చి చూసుకున్నాడు అది కలేమోనని. నొప్పి పుట్టింది.

'తమలోని ఒక వ్యక్తిని చనిపోయినట్లుగా నటింప జేసి డబ్బుకోసం ఆడిన నాటక మన్నమాట!

"ఇంపోస్టర్స్, బ్రూట్స్" కసిగా గొణుక్కున్నాడు రామకృష్ణ.

దగ్గరగా వచ్చారు వాళ్ళు. వారిని నిలవేసి "ఏమిటీ నాటకం?" అని ఏదో అడగబోయాడు రామకృష్ణ. కాని అంతలోనే ఒకవ్యక్తి కెవ్వుమని కేకవేసి అల్లంత దూరాన ఎగిరి పడ్డాడు. మిగతా నలుగురూ అదిరిపడి, బిత్తరపోయి తమ భాషలో ఏదో అంటూ క్రింద పడిన వ్యక్తి చుట్టూ చేరారు.

పూర్వపు యాచకుడు అగ్గిపుల్ల వెలిగించాడు. ఆ వెలుగులో రామకృష్ణ చుట్టూ చేరిన ఆ నలుగుర్ని గుర్తుపట్టాడు. వాళ్ళు శవ వాహకులు. క్రింద పడిన వ్యక్తి మరణించినట్లు నటించిన వ్యక్తి అయివుండాలి.

ఆ వ్యక్తులకూ తనకూ మధ్యగా ఏదో జరజరా ప్రాకినట్లు ముందుకు చూశాడు రామకృష్ణ. ఆ నలుగురు వ్యక్తులూ ఒక్కసారిగా "అమ్మో పాము" అంటూ ప్రక్కకు తొలగారు గాభరాగా.

మరో అగ్గిపుల్ల గీచారు ఎవరో. ఆ గ్రుడ్డి వెలుగులో తన ముందు నిలబడివున్న రామకృష్ణను చూచి ఆ నలుగురూ నిలువునా నీరు కారిపోయారు.

మర్నాడు—

ఉదయం ఏడుగంటలకు బస్సుకోసం ఆదరాబాదరా పరుగెత్తుతున్న రామకృష్ణ కొత్త వంతెన క్రిందుగా, కాలువ ప్రక్కగా శవాన్ని పరుండబెట్టి దారిన వచ్చే పోయే వాళ్ళని యాచిస్తున్న వ్యక్తినీ, హృదయ విదారకంగా విలపిస్తున్న ఇద్దరు స్త్రీలను చూశాడు. అదే ప్రదేశంలో రాత్రి చూచిన దృశ్యానికి, యిప్పుడు కన్పించే దృశ్యానికీ తేడా లేదని ఎవరైనా అంటే అనవచ్చు. కాని, ఎంతో తేడా వుందని రామకృష్ణ అంతరాత్మ హెచ్చరిస్తున్నది.

ఇప్పుడా ఆ రేళ్ళ కుర్రవాడు, పసికూనకూడా ఏడ్వడంలో ప్రస్ఫుటిస్తోంది-రామకృష్ణ కొక్కడికే తెలిసిన తేడా!

# చేదు నిజం

"ఈ వార్త నిజమే నంటావా?"—మనశ్శంక శేఖరం వంక ప్రశ్నార్థకమై నిలిచింది.

"నిజం కానిది అమ్మ ఎందుకు వ్రాస్తుంది?" అమ్మ మీది నమ్మకం మనశ్శంకతో కుస్తీకి సిద్ధమైంది.

చేతిలోని గ్లాస్ పేపర్ వెయిట్ అప్పటికే టేబిల్ మీద కొన్ని ఫర్లాంగుల దూరం ప్రయాణం చేసింది—వ్రేళ్ళను ఇరుసుగా చేసుకుని, అతని మనో సాగరంలో ఉవ్వెత్తున లేచిన కెరటాలు సగంలోనే విరిగి పడుతున్నై. ఇదమిత్థమని తెలియని సత్యాన్ని అన్వేషించటానికి ముందుకు సాగుతున్నా యతని చూపులు.

"మిస్టర్ శేఖర్"

"............" శేఖరం ఈ లోకంలో లేడు.

"శేఖరం" ఉక్కు ఢక్కను బ్రద్దలు కొట్టినట్లయింది.

శేఖరం అదిరిపడి లేచాడు. ప్రక్కన మొహం కందగడ్డలా చేసుకుని శివతాండవం చేస్తున్న ఆఫీసరు! కలవరపడి. "సారీ సార్" అన్నాడు తల దించుకుంటూ.

"ఏమిటీ పరధ్యాన్నం? ఇదేమన్నా, ఆఫీసా? అయ్య గారి ఆలోచనా మందిరమా? ఫ్యాన్ చేత కబురు చేస్తే ఆరుసార్లు 'ఊ' అనటమేగాని, కదిలే పనిలేదా?ఆఫీసర్లంటే ఇంత నిర్లక్ష్యమైతే ఉద్యోగాలు వెలగబెట్టే అవకాశమే ఉండదు.........జాగ్రత్త"—అగ్గి బరాటాలా అతి కోపంతో గడగడా అరిచేశాడు ఆఫీసరుగారు.

బదులు చెప్పలేక పోయాడు శేఖరం.

"మీరు నాతో రండి"

తన దురదృష్టాన్ని లోలోపలే నిందించుకుంటూ ఆయన్ననుసరించేడు శేఖరం.

పావుగంట తర్వాత చేతిలో షుమారు రెండు కిలోల బరువుగల ఆఫీసు ప్యాడుతో తన సీట్లో కొచ్చాడు. అతని గుండెల్లో రాయి పడింది. ఆ పనిని ఆ రోజే పూర్తి చేసి సంతకాలకు పంపాలట—ఆఫీసరు గారింటికి. భయ భయంగా మరోమారు ప్యాడ్ వంక చూసేడు. తన విధి నిర్వాహణను సవాలు చేస్తూ టపటప లాడుతున్నాయి ఫైళ్ళలోని కాగితాలు.

శేఖరం మనస్సు మనస్సులో లేదు. అతని ఆలోచనలన్నీ అమ్మ వ్రాసిన జాబుమీద ఉన్నై. టేబుల్ సొరుగు లాగి ఉత్తరం తీశాడు. మళ్లీ చదువుకున్నాడు. ఐదవసారి చదువుకున్నా, అందులోవున్న విషయాలు నూరలేదు. ఉత్తరం మడిచి ఏదో నిశ్చయానికి వచ్చిన వాడిలా ఫైళ్ళను తనముందుకు లాక్కుని చూడటం ప్రారంభించాడు.

రెండు గంటలు గడిచినై...

ఆఫీసరుగారు కేటాయించిన పనిని పూర్తి చేసి ప్యాడ్‌ను ప్రక్కకు నెట్టాడు, శేఖరం. ఒక పావుఠావు కాగితం తీసికొని హడావిడిగా ఏదో వ్రాసి సీట్‌లోంచి లేచాడు. కాగితాన్నీ, ప్యాడ్‌నీ పుచ్చుకుని ఆఫీసరుగారి గదిలోకి ప్రవేశించాడు.

ఆఫీసరుగారు దీర్ఘాలోచనా నిమగ్నులై ఉన్నారు.

"సార్" అని నెమ్మదిగా పిలిచాడు శేఖరం.

ఆఫీసరుగారి చూపులు శేఖరం మీదికి, అక్కడి నుంచి టేబుల్ మీది ప్యాడ్ మీదికీ ప్రయాణం చేశాయి.

"ఓ...యూ హావ్ కంప్లీటెడ్ యిట్!" ఆశ్చర్యానందాలు తొణికిసలాడే ముఖంతో ప్రశ్నలాంటి మాట పలికాడు.

"యస్ సార్"—శేఖరం సమాధానంలో వినయం, విధేయత.

"గుడ్. సిన్సియారిటీ అంటే యిలా ఉండాలి" తెచ్చి పెట్టుకున్న మెచ్చికోలు కాబోలు ఇది.

ఒక్క క్షణం ఏమీ మాట్లాడక, సందేహంగా తన చేతిలో కాగితాన్ని ఆఫీసరుగారి ముందుంచాడు శేఖరం.

దానిపై తన సురసుర దృక్కుల్ని బరపి, తలెత్తి అదోలా శేఖరంవైపు చూసేరు ఆఫీసరుగారు.

శేఖరం హృదయం వేగంగా కొట్టుకోసాగింది. ఆయనేం మాట్లాడ బోతున్నాడో ననే భయంతో అతని మనస్సు వూగిపోతోంది.

"చూడండి శేఖరం. మీ సీటు ఎంత 'అప్ టూ

'డేట్'గా ఉన్నా ఆఫీసంతా అల్లకల్లోలంగా వున్న సంగతి మీకు తెలియందికాదు. పైగా వచ్చేవారం 'ఇన్‌స్పెక్షన్' కూడా ఉంది. ఇటువంటి పరిస్థితుల్లో సెలవుక్కోరి నన్ను ఇరుకున పెడుతున్నారు." కుర్చీలో వెనక్కువాలి, రెండు చేతులూ కలిపి తమాషాగా త్రిప్పుతూ, సాలోచనగా శేఖరాన్ని చూశారు ఆఫీసరుగారు.

శేఖరం నీరు కారేడు. బదులు చెప్పటానికి కూడా, పచ్చి వెలక్కాయ గొంతున పడినట్లయింది. నీళ్ళు నములుతూ, హీనస్వరంతో "చాలా అవసరం సార్" అన్నాడు ప్రాధేయ పూర్వకంగా.

"ఊఁ"

"పైగా ఉద్యోగంలో చేరిన తర్వాత ఇంతవరకూ సెలవు తీసుకోలేదు నేను"—ఇది తన ప్రత్యేకత.

గదిలో నిశ్శబ్దం తాండవించ సాగింది. కొద్దికాలం గడిచింది.

"పొజిషన్ చూసి పంపుతాను. మీరు వెళ్ళండి" కుర్చీలోనుంచి ముందుకు లేస్తూ అన్నారు ఆఫీసరుగారు.

అర్ధాశతో బయట పడ్డాడు శేఖరం. వచ్చి తన సీట్లో కూర్చున్నాడు. శరీరమంతా చెమటలు పట్టింది. తన పరిస్థితి తనకే చిరాకుగా ఉంది. ఉత్తరం తీసేడు మళ్ళీ. కత్తిపోటు లాంటి కబురును చేరవేసిన ఆ ఉత్తరాన్ని తగలపెట్టాలన్నంత కోపమొచ్చిం దతనికి. అంతలోనే 'అమ్మ వ్రాసిన ఉత్తరం' అని హెచ్చరించింది మనస్సు. అయినా కొంత

మందికి ఉత్తరాలలో వ్రాయదగిన వార్తలేవో, తగనివేవో తెలియదు. పిడుగులాంటి వార్తల్ని ఉత్తరాల ద్వారా తెలిపి హృదయంలో ఆవేదనాగ్నిని రగుల్కొలుపుతారు.

అరటిపూచ పీచులా తీవలు సాగుతున్నా యాంతని ఆలోచనలు. పైన గిరగిర తిరుగుతున్నది, సీలింగ్ ఫాన్. శేఖరం మనస్సు యింటి చుట్టూ పరిభ్రమిస్తున్నది. ఎప్పు డెప్పుడు ఇంటికి చేరటమా అని తొందర పెడుతున్న దాతని మనస్సు. అంతలోనే పెద్ద సందేహం ఎదురైంది. 'సెలవు యిస్తారో లేదో'

ఉన్నట్టుండి సీలింగ్ ఫ్యాన్ ఆగిపోయింది. గంట గంటకూ కరెంటు ఆగుతూ ఉండటం ఆ శాఖ పనితనానికి నిదర్శనం.

హడావిడిగా అక్కడికి చేరుకున్న జవాను తన చేతిలో వున్న కాగితాన్ని శేఖరాని కందించాడు.

సంతృప్తిగా ఊపిరి పీల్చుకున్నాడు శేఖరం—సెలవు మంజూరైంది.

ఒంటిగంట అయిన సూచనగా లంచ్ బెల్ కొట్టారు. లేచి గబ గబా అడుగులు వేస్తూ సాగిపోయాడు.

* * *

"నేను నెల్లూరు వెళ్ళొస్తానమ్మా!" తల్లి చెప్పిన విషయాలన్నీ విన్న తర్వాతనే అన్నాడు శేఖరం.

"చూడు శేఖర్, నెల్లూరు వెళ్ళి చేసేదేముంది? బాబాయి రాసిన ఉత్తరాన్ని చూస్తివిగదా. ఆయన

కాలుకు ఆపరేషన్ చేయించుకుని హాస్పిటల్లో ఉన్నాడు ఆ ఆసుపత్రిలోనే ఉన్నారుట మామయ్యా వాళ్ళు కూడా. ఇంకా నమ్మలేకపోతే ఎలా? పైగా మీ బాబా యేమన్నా ఆషామాషీ మనిషా ఏమన్నానా, ఏదో రాశాడని సందే హించటానికి" అని ఒక్క క్షణం ఆగి "ఏమో నాకు మాత్రం నిజమేనని పూర్తి నమ్మకం కుదిరింది" అన్నది రాఘవమ్మ కొడుకు ముఖ కవళికల్ని గమనిస్తూ.

శేఖరం మౌనం వహించాడు.

"అయినా నేను మొదట్నుంచీ చెపుతుంటే చెవిని పెట్టావా? ఉద్యోగం రాగానే ఆ మూడుముళ్ళు వేసెయ్యరా అంటే నీకేమీ తలకెక్కకపోయె. ఇప్పుడెంతగా బాధపడి ఏం లాభం?"

అయోమయంగా అమ్మవైపు చూశాడు శేఖరం. తప్పు తనదేనని ఆమె అభియోగం. నిజమేననిపించింది.

తనకు ఉద్యోగంవచ్చి రెండేళ్ళయింది. ఉద్యోగంలో చేరిన కొత్తలో అమ్మ తన పెళ్ళిసంగతి తీసుకొచ్చినమాట నిజమే. కాని, తానప్పుడే అంగీకరించలేకపోయాడు. ప్రమోషన్ పరీక్షలు కూడా ఒక్క ఏడాదిలో పూర్తి చేసి, సుఖవంతమైన జీవితంతో సంసారంలో ప్రవేశిద్దామని ఆశించాడు. అందుకనే అమ్మ ఎన్నిసార్లు చెప్పినా వినలేకపోయాడు. ఈ రెండేళ్ళలో పరీక్షలు పూర్తి చేయటం, ప్రమోషన్ రావటం జరిగింది. యాంత్రికమైన ఆఫీసు జీవితానికి, పరీక్షల

చదువుకూ అంటిపెట్టుకుపోయి ఇంటికి కూడా వెళ్ళలేక పోయాడు. అథవా వెళ్దామనే కోరిక కలిగినా, సెలవు మంజూరు కావట మనేది అంతాంత మాత్రమనే కటిక సత్యం ఆ కోరికను మొదట్లోనే అంతరింప చేసేది. వివాహ విష యంలో తను చూపిన నిర్లక్ష్యమే ఈ పరిణామాలకు కారణ మంటున్నది అమ్మ. తీరా తను పెళ్ళిచేసుకోవాలని తహ తహలాడే తరుణంలో పిడుగులాంటి ఈ వార్త తన ఆశా సౌధాల్ని నేలకూల్చింది!

అల్లిబిల్లిగా అల్లుకో జూస్తున్న ఆలోచనా వల్లరుల్ని త్రుంచి "ఏది ఏమైనా ప్రత్యక్షంగా చూస్తేతప్ప నమ్మ లేనమ్మా నే నీ విషయాన్ని" అన్నాడు శేఖరం.

"అవున్రా నువ్వలా నమ్మగలవు. ఇదైతే నమ్మ లేనంటున్నావేగానీ, ఆనాడు సరోజ పలికిన ముఖప్రీతి మాటల్ని మాత్రం ప్రత్యక్షర సత్యాలుగా నమ్మి పొంగి పోకుండా ఉండలేక పోయావ్"

తల్లిమాటల్లోని ఎత్తిపొడుపునకు బాధ కలిగింది శేఖ రానికి. ఆమాటకొస్తే అమ్మ మాత్రం పొంగిపోలేదా?— ఇప్పుడిలా అంటున్నదే కాని ఆమె మాటల్తో అతని తలపులు గతంలోకి పరుగులు తీశాయి.

* * *

దసరా పండక్కి నెల్లూరునుంచి వచ్చింది సరోజ. సరోజ రాకతో తమ యిల్లు కళకళలాడింది. అమ్మకు సరో జంటే వల్లమాలిన అభిమానం, అమితమైన ప్రేమ ఉండేవి.

మా బంధువర్గంలోని ఆడపిల్ల లందరికీ సరోజ ఒక్కతే. స్కూలుఫైనల్ వరకూ చదవటం వలన, పదవ యేటనే తల్లిని కోల్పోవటం వలన సరోజంటే ప్రత్యేకమైన ఆప్యాయత, జాలి, సానుభూతి పొంగిపోయేవి, అమ్మ హృదయంలో.

సరోజ ఉనికే పండుగగా మారింది తమకు. ఆరోజు విజయదశమి. నూతన వస్త్రాలు ధరించి అమ్మకు నమస్కరించింది సరోజ.

"గంపెడు బిడ్డల్ని కని, వెయ్యేళ్ళు వర్ధిల్లుకోడలా" అంటూ దీవించింది అమ్మ. ఆమె కండ్లలో తిరిగిన ఆనంద బాష్పాలు సరోజ తలపై మంగళాక్షతలు చల్లాయి.

ముసిముసిగా నవ్వుకుంటూ మొహం చేతుల్లో దాచుకుంది సరోజ.

"జాగ్రత్త సరూ......అంతమంది పిల్లలైతే నేవేగలేనుసుమా"—సరోజను ఉడికించాలనే అన్నాడు తను.

ఆమె చెక్కిళ్ళపై పూచిన గులాబీల ముగిపాలు, ఆమె పెదవులపై విరిసిన మల్లెల సోయగంతో పోటీపడ్డినై.

ఆ రాత్రి......

భోజనంచేసి ఆరుబయట వెన్నెల్లో పడుకుని భవిష్య జీవితాన్ని స్వర్గధామంగా చిత్రించుకుంటూన్నాడు తను. లోపల అమ్మా, సరోజా భోజనాలుచేస్తూ మాట్లాడుకుంటున్నారు.

"మీ బావకీ సంవత్సరంతో చదువైపోయింది. ఎక్కడో ఒకచోట ఉద్యోగం రాకపోతుందా. ఇక మీ

నాన్నదే తొందర. నువ్వా ఎంత కాలమని కాచిపోస్తా వాయనకు. ఆ మూడు ముళ్ళూ పడితే అందరం ఒకే చోట ఉండొచ్చు.........ఏమంటావ్?"

"అమ్మ కెప్పుడూ నా పెళ్ళి ఆరాటమే" అనిపించింది తనకు.

"నాదేముంది అత్తయ్యా" అన్నది సరోజ—ఆమె మాటల్లో పొందిక, గౌరవం.

"అది సరే సరూ. నిన్నొక మాటడుగుతాను చెప్తావ్?"

"అడుగత్తయ్యా"

"బావను గురించి నీ వుద్దేశ మేమిటి సరూ?" అమ్మ ప్రశ్నకు తనే ఆశ్చర్యపోయాడు.

"అదేమిటత్తయ్యా అలా అడుగుతావు?"

"మరేం లేదు సరూ...మా సంగతి తెలియంది కాదుగా నా భారమే కాకుండా కాపురాలు చేస్తున్న నలుగురి ఆడపిల్లల బాధ్యత వాడిమీద వుంది. వెనకాముందూ చూడబోతే ఏమీ లేదుగా. ఈ ఇంటికి రాబోయే కోడలు తెలుసుకోవాల్సిన విషయాలు కావూ ఇవి?"

"అత్తయ్యా...కేవలం ఈ ఇంటి కోడలుకావటమే మహద్భాగ్యంగా భావిస్తానుగానీ, ఇలాంటి ఆలోచనలే నాకు కలుగవు" అని ఆవేశంగా అని, "నన్నర్థం చేసుకున్న నీవే ఇలా ప్రశ్నించటం...?" అని అర్థోక్తిలో ఆపేసింది సరోజ. ఆమె స్వరంలో బాధ ధ్వనించింది.

"నీ మనస్సు తెలియక కాదు సరూ. నా బాధ్యత నేను నెరవేర్చుకోవటంకోసం. అంతే; మరేమనుకోకు" అని రెండు క్షణాలాగి "అయితే మీ నాన్నకు చెప్తావా నే నన్న సంగతి? త్వరలో ముహూర్తం చూసి జాబు వ్రాయమను" అంది అమ్మ.

సరోజ మౌనం వహించింది.

భోజనాలు పూర్తిచేసిన తర్వాత మంచినీళ్ళు తీసుకుని తన దగ్గర కొచ్చింది సరోజ. లోపల వంటిల్లు సర్దుకుంటున్నది అమ్మ.

సరోజ చేతుల్లో మంచినీళ్ల చెంబు తీసుకుంటూ, "ఏం సరోజా, మీ యింటి చిలకమ్మ వెళ్ళటగదా"అన్నాడు తను, సరోజ ముఖ కమలంలోని మధువును కళ్ళతోనే గ్రోలుతూ.

"అవును. ఈ ఇంటి గోరింకతో" అన్నది సరోజ, తలను లాలసంగా ప్రక్కకువంచి, చక్రాల్లాంటి కళ్ళతో చిలిపిగా నవ్వుతూ. ఆమె చూపులు తన గుండెల్లో తూపులై బాధించాయి.

* * *

ఆనాటి సరోజ చూపుల్లో గోచరించిన నైర్మల్యం, అమాయకతా, జాలువారిన అనురాగం. తన పట్ల శాశ్వత మౌతాయనుకున్నాడేగానీ, ఇలా జరుగుతుందనికలగన్నాడా తను మాత్రం?

కొడుకు పట్టుదల వహించటంతో మరేమీ అనలేక "నీ యిష్టం" అని వూరుకుంది రాఘవమ్మ.

తల్లికి అంతగా ఇష్టంలేకపోయినా, తన మనస్సాక్షికి విరుద్ధంగా నడవలేక నెల్లూరు బయల్దేరాడు శేఖరం.

శేఖరం వీధిలోకి వెళ్ళేసరికి; ఇంటి వీధివాకిట నిలబడి మరో స్త్రీతో ఏదో మాట్లాడుతున్నది సరోజ. అతను రిక్షా దిగటంచూసి గబగబ లోపలికి వెళ్ళారు వాళ్ళిద్దరూ. రిక్షా దిగి లోపలికి ప్రవేశించాడు శేఖరం. అతని హృదయం బరువెక్కింది. తను చూడబోయే దృశ్యాలను తలచుకుని మనస్సులో ఏదో తెలియని బాధ మొదలైంది.

పనిమనిషి చెంబుతో నీళ్ళు తెచ్చి అక్కడ ఉంచి వెళ్ళింది.

"కాళ్ళు కడుక్కో బావా..."

సరోజ మృదుమధుర స్వరం శేఖరం-హృదయంలో గూడుకట్టుకుని దోబూచులాడుతున్న అనుమాన విహంగాల నన్నిటినీ పారద్రోలింది ఒక్కసారిగా.

మంత్రముగ్ధుడిలా ఆ పని నెరవేర్చాడు. వెనకకు తిరిగేసరికి ఎదురుగా టీపాయ్‌మీద కాఫీగ్లాసు.

"కాఫీ తీసుకో"-మర్యాదపూర్వకమైన ఆదరణ.

కాఫీ త్రాగేడు. క్షేమ సమాచారాల పరామర్శలైన తర్వాత నెమ్మదిగా బయటకొచ్చింది సరోజ.

శేఖరం హృదయాన్ని పిండేసినట్లుంది. అతని గుండెల్లో మండుతున్న అగ్నిపర్వతం బ్రద్దలై కళ్ళు తేలిపో తున్నట్లయి - యెదురుగా వున్న దృశ్యాన్ని లీలగా కను పింపజేసినై. మానసికంగా అర్థంకాని భావ సంఘర్షణ, శారీర

కంగా అర్థమవుతున్న అశక్తత—ఈ రెంటితో అతను కర్తవ్యతా విమూఢుడైనాడు.

కొద్ది క్షణాలైనాయి.

కళ్ళు నులుముకుని మళ్ళీ చూసేడు శేఖరం. సందేహంలేదు. పూచిన గులాబీలా మంగళమూర్తి సరోజ! చేతిలో దబ్బపండువంటి పిల్ల!

"మా అమ్మాయి బావా. మొన్ననే నెల వెళ్ళింది" మాతృత్వం నిండిన పులకింపుల పలుకులు

శేఖరం అయోమయంగా ఆమెవైపు చూసేడు. తెచ్చిపెట్టుకున్న చిరునవ్వయినా లేకుండా అతని అవస్థను అర్థంచేసుకుంది సరోజ. పిల్లను ఒళ్లోపెట్టుకుని, తనూ కూర్చుంది.

కొద్ది నిమిషాల నిశ్శబ్దం తర్వాత మొదలెట్టింది.

"క్షణానికి జరిగేది మనకు తెలియదనే సూక్తి ఎంత నిజమో నాకిప్పుడు బాగా అర్థమైంది. నన్నీ స్థితిలో చూసి నువ్వెంతో బాధ పడటం సహజం. కాని ఆ క్షణం అలాంటిది. అవును—కాదు, మంచి—చెడుల మధ్య వూగిసలాడిపోయి ఈ మార్గానికి మళ్ళింది నా మనస్సు. ఇది అందరి దృష్టిలోను చెడు కావచ్చు. నీకు ద్రోహం చేసినట్లు నువ్వో అనుకోవటంలో తప్పులేదు. నిజానికి నేను నీకు ద్రోహమే చేసేను. కాని నేనీ పనికి పూనుకోవటంలో నీ బాధ్యత కూడా కొంత ఉంది."

శేఖరం తలెత్తి చూసేడు.

"అవును" అని దృఢంగా అన్నది సరోజ, అతని కళ్ళ

లోకి చూస్తూ. శేఖరం ఆమె కళ్ళలోకి సూటిగా చూడలేక తలను ప్రక్కకు తిప్పుకున్నాడు.

ఆమె చెప్పుకు పోతున్నది "అమ్మ పోయిన నాటి నుంచీ, నేనంటే ఎంతో అభిమానం, ఆప్యాయతా చూపేరు అత్తయ్యా, నువ్వూను. అశుభం శుభం తెలియని చిన్న వయస్సులోనే నీమీద మమతలు పూచి, మనసు నీ కోసమే ననే భావన కలిగింది నాకు. నీ ఆధారంతో నా జీవితం నందనవన మవుతుందని కలలు కన్నాను. కానిఎన్నాళ్ళు?—

"ఎన్నాళ్ళు నీ కోసం కన్నులు కాయలు కాచేలా ఎదురు చూసేది? ఉత్తరాలమీద ఉత్తరాలు వ్రాసినా, నీ దగ్గరనుంచి సమాధానం రాదు. అత్తయ్య దగ్గరనుంచి 'ప్రమోషన్ రాగానే అదే ప్రయత్నం' అనేమాట. నీ వంటే నాకు ప్రేమ, అభిమానం, గౌరవం ఉన్నమాట నిజమే. కాని నా పరిస్థితి అడకత్తెరలోని పోక చెక్కలా అయిపోయింది.

"బావా, ఈ విషయం నీకు తెలిసి ఉండదు. మా నాన్న ఒక స్త్రీతో అక్రమ సంబంధం పెట్టుకున్నాడు. ఇంట్లో ఈడొచ్చిన ఆడపిల్ల ఉందనే విచక్షణయినా లేకుండా నా ఎదుట వారి ప్రవర్తన మితిమీరిందనే చెప్పాలి. అలాంటి సమయాల్లో నాలోని స్త్రీత్వం విజృంభించి నా అంతరాత్మ నన్ను ప్రోత్సహించేది. 'నీ వయసు, సొగసు ఎందుకిలా నాశనం చేసుకుంటా' వని. కాని నిన్ను నమ్ముకున్న మనస్సు హెచ్చరించేది. 'బావకు ద్రోహం చేస్తావా' అని. ఈ సంఘర్షణలో చివరికి నేను పరాజితనై పోయాను. దానికి

ఆ పరిస్థితుల్లో. నా ఉనికీ, నీ ఉదాసీనతలే కారణం. నీహృద యంలో కలిగించిన గాయానికి నన్ను క్షమించు బావా?"

సరోజ కన్నీళ్ళు తుడుచుకుంటూ పూర్తిచేసింది.

పొడి ఆరిపోయిన నాలుకను తడుపుకుంటూ అడిగేడు శేఖరం. "జరిగిందేదో జరిగిపోయిందనుకో. పోనీ అతనితోనే వివాహం చేసుకోకుండా. ముందుగా ఎందుకు వేశావీ తప్పటడుగు?"

"మాటకు కట్టుబడి ఉండాలికాని, ఈ సంఘపు కట్టుబాట్లు మన కెందుకనే తత్వం వారిది. నే నెన్ని చెప్పినా వినలేదు"—ఆమె మాటల్లో అసహాయత.

"ఏం చేస్తూ ఉంటాడు?" యథాలాపంగా ప్రశ్నించాడు.

"నీ కెందుకీ వివరాలన్నీ?" అని సణిగింది—మనసు.

"ఏమైనా సరోజ శ్రేయోభిలాషిని నేను"—తను సమాధానం చెప్పుకున్నాడు.

"ముప్పై ఎకరాల పొలం ఉంది. ఏదో వ్యాపారం చేస్తున్నారట. ప్రస్తుతం ఊళ్లో లేరు. నాన్న కూడా ఏదో పనిమీద తిరుపతి పోయాడు."

మరో కొద్ది సేపు ఉండి "వెళ్ళొస్తా సరోజా" అంటూ లేచాడు. ఒక్కపూటయినా ఉండిపొమ్మని బలవంతం చేసింది సరోజ. "పనిమీద మద్రాసు పోతున్నా" నని అబద్ధమాడి బయలుదేరాడు శేఖరం. తిరుగు ప్రయాణంలో నన్నా రమ్మనమని మరీ మరీ చెప్పింది సరోజ. సరే నని వచ్చేశాడు శేఖరం.

*    *    *

హాస్పిటల్‌కుపోయి బాబాయిని చూశాడు శేఖరం. సరోజ పురిటికి ఆ ఆసుపత్రిలోనే ఉన్నదని మరోమారు చెప్పేడు ఆయన. నెల్లూరును వదలి రైలెక్కిన శేఖరం మన స్సులో ఊహలు ప్రోవులైనాయి. సరోజను గురించిన నిజాన్ని కళ్ళారా చూసిన శేఖరం, తనను గురించి వెల్లడింప బడిన సత్యాన్ని గురించి ఆలోచించటం మొదలెట్టాడు.

రైలు చీకట్లను చీల్చుకుంటూ సాగుతున్నది. చవితి చంద్రుని గ్రుడ్డి వెలుగులో శూన్యంలోకి చూస్తూ కూర్చు న్నాడు శేఖరం. వెనుకకు పోతున్న పొలాలను భూమి గుండ్రంగా ఉందన్న విషయానికి ఋజువుగా చెప్పేవాడు, ఎలి మెంటరీ స్కూల్లో జాగ్రఫీ మాస్టారు. నిజమేననిపించింది. సరోజను చూసేడు. తిరిగి వెళ్తున్నాడు. పైగా ఆమెచేత అనిపించుకోవలసిన మాట అనిపించుకున్నాడు తను. అమ్మ అన్న మాటే సరోజా అన్నది. ఈ పరిణామానికంతా తన ఉదాసీనతే కారణమట.

తన అసమర్థతమీద తనకే అసహ్యం వేసింది శేఖ రానికి. జీవితంలో ఏదో మహాత్కార్యం సాధించి, సంసార సాగరంలో దూకుదామని రోజులు గడిపాడు తను. తీరా తాను సిద్ధపడేసరికి సాగరమే ఎండిపోయింది. దానికి బాధ్యుడు తానా?—

ఎదురు బల్లమీద కూర్చున్న యువకుడు తన వంక అదేపనిగా చూస్తూ, ఏదో మాట్లాడించాలని ప్రయత్నిస్తు న్నట్లు గమనించి అతని వైపు చూసేడు శేఖరం—తన ఆలో చనలను తాత్కాలికంగా ఆపి.

"మిమ్మల్ని ఎక్కడో చూసినట్లుందే" సాలోచనగా అన్నాడతను.

ఈ రకపు పలకరింపులు మామూలైపోయాయి ఈ కాలంలో. శేఖరం గమనించి చూశాడు. గుర్తొచ్చింది. నాలుగేళ్ళక్రితం తనకు నెల్లూరులో సరోజా వాళ్ళయింటి సందు చూపిన ఆపద్బాంధవు డతను. ఆవ్యక్తి జ్ఞాపకశక్తికి కొంచెం ఆశ్చర్యమే పొందాడతను.

"అవును. మీది నెల్లూరేకదూ?" అన్నాడు శేఖరం.

"ఆ గుర్తొచ్చింది. నాలుగేళ్ళక్రితం మీరు మధ్వపతివారి వీధికోసం వెతుకుతుంటే..." అతనుసంతోషంతో అరిచేశాడు.

"ఇప్పుడెక్కడుంటున్నారు?" అతనేమళ్ళీ ప్రశ్నించాడు.

"బందరులో ఉద్యోగం చేస్తున్నాను. మరి మీరో?"

"మాది నెల్లూరే. మీ బంధువులుండే వీధే. తిండికీ, గుడ్డకూ దిగుల్లేదులెండి. ముప్పై ఎకరాలు పొలం ఉంది. వ్యాపారం చేస్తున్నాను. పనిమీద బెజవాడ పోతున్నా."

శేఖరం గతుక్కుమన్నాడు. అతని ఊహాపథంలో అడ్డుగా ఈ వ్యక్తీ, సరోజా ఎదురైనారు. ఏవేవో ఆలోచనలు ముసురుకో చూసే యతన్ని.

"బందరేనా వెళ్ళటం?" హోల్డాలు పరుచుకుంటూ అడిగాడతను.

"కాదండి, తెనాలి వరకూ. మాస్వగ్రామం తెనాలి లెండి" అని, "మీ పేరు" అన్నాడు శేఖరం.

"కృష్ణ" అతను జవాబిచ్చాడు.

రైలేదో స్టేషనులో ఆగింది. జనం లోపలికి రావటంతో వారి మాటలకు అంతరాయం ఏర్పడింది. కంపార్టుమెంటులో రద్దీ ఎక్కువ కావటంతో వేసిన హోల్డాలుతీసేసి ప్రయాణీకులకు చోటిచ్చాడు కృష్ణ. నలుగురైదుగురు వ్యక్తులువచ్చి అతను కూర్చున్న బల్లమీద కూర్చున్నారు.

రైలు మళ్ళీ బయలుదేరింది. కృష్ణ మౌనం వహించేడు. జనమంతా నిద్రతో జోగుతున్నారు. శేఖరం ఆలోచనలన్నీ కృష్ణమీద కేంద్రీకృతమై ఉన్నాయి. కృష్ణను చూస్తుంటే సరోజ ఎంతో అదృష్టవంతురాలనిపించింది. అతని వేష భాషల్ని బట్టీ, అతని మాట తీరునుబట్టి ఎంతో సంస్కారిలా కనిపిస్తున్నాడు కృష్ణ. అతనే కనుక సరోజ భర్త అయివుంటే—ఆమె ఎన్నిక గొప్పదనే చెప్పాలి. ఏ విధంగా చూసినా తాను కృష్ణకంటే అధికుడు కాలేడు. ఆలోచనలతో కొడిగట్టిన శేఖరం మేధస్సు నిద్రాదేవి ఒడిలో సోలిపోయింది.

తెల తెలవారబోతుండగా మెయిల్ తెనాలి స్టేషన్లో ఆగింది. అరుపులతో కోలాహలంగా ఉంది స్టేషన్ వాతావరణం. శేఖరం లేచి గబ గబా క్రిందకు దిగాడు. కృష్ణ కూడా లేచాడు కంపార్టుమెంటు గేటు వరకూ వచ్చి శేఖరానికి వీడ్కోలు చెప్పాడు. దినపత్రిక కొంటూ జేబులో చెయ్యి పెట్టాడు. ఏదో పోగొట్టుకున్నవాడిలా తొట్రుపడి లోపలకు వెళ్ళాడు. క్షణంలో ఒక వ్యక్తిని చొక్కా పట్టుకుని ప్లాట్ఫారం మీదికి లాక్కొచ్చాడు. వాళ్ళచుట్టూ జనం గుమిగూడారు.

వెళ్ళిపోతున్న శేఖరం కూడా ఈ గలభానుచూసి సహజమైన ఉత్సుకతతో అక్కడికి వొచ్చాడు.

"చూశారా సార్. రాస్కెల్. ప్రక్కన కూర్చు న్నట్లే కూర్చుని పర్సు కొట్టేశాడు..." ఇంకా ఏదో చెప్తు న్నాడు కృష్ణ.

ఇంతలో పోలీస్ ఆ వైపునవచ్చి విషయం కను క్కున్నాడు. కృష్ణనుకూడా దిగమన్నారు. సామాన్లు దించు కుని క్రిందికొచ్చాడు కృష్ణ.

అంతా పోలీసు స్టేషనుకి చేరుకున్నారు. పోలీసులు నాలుగు తగల నిచ్చేసరికి పర్సు దొంగిలించినట్లు ఒప్పేసు కున్నాడా యువకుడు. అతని జేబులు సోదాచేసి రెండు జేబు ల్లోను రెండు పర్సుల్ని తీసి టేబుల్‌మీద పడేశాడొక కాని స్టేబుల్.

ఆ రెండు పర్సుల్లో ఒకటి కృష్ణది. దాన్ని కృష్ణకిచ్చే శారు. రెండవది తన స్వొంతమని బిక్కు బిక్కుమంటూ చెప్తున్నాడా యువకుడు. కానిస్టేబుల్ ఆ యువకుని పర్సు తీసి చూడసాగాడు. శేఖరం తలముందుకువంచి దాన్ని గమ నించాడు.

పర్సు మొదటి ఫోల్డులోనే ఒక ఫోటో!

ఫోటోలో ఆ యువకుడు—ప్రక్కనే సరోజ!

"ఈమె......ఈమె......"అని ఆశ్చర్యంగా గొణు క్కున్నాడు శేఖరం.

"నాభార్య" తలను పైకెత్తి మరీ అన్నాడా యువ కుడు. శేఖరం నిశ్చబ్దుడైనాడు.

---

# ఎత్తు పల్లాలు

మదకుంభి కుంభస్థలాన్ని తప్ప అన్యమొల్లని కేసరి- చిట్లిన ఎముకలు దొరకని చిల్లర మృగాలు, ఒకే కాంతారంలో జీవయాత్ర సాగిస్తున్నాయి. శాఖోపశాఖలై విస్తరిల్లిన మహా వృక్షాలు - ఆరడుగులకన్నా మించి పెరుగని అలతిచెట్లు, అంబర చుంబితోత్సాహులైన అవనీధరాలు - కొండల ఆకారాన్ని మాత్రం కలిగిన చట్టుబండలు - ఇవన్నీ ప్రకృతిలో గోచరించే వింతలే.

భిన్నత్వం, అంతరం, అసమానత్వం ప్రకృతిధర్మాలు. ప్రకృతిలోని భిన్నత్వాన్ని మించిన అంతరం మానవుల్లో సైతం వుంది. మన సత్వాల్లో - వ్యక్తిత్వాల్లో, రూపాల్లో - వయస్సుల్లో, ఉనికిలో - జీవన మార్గాల్లో కొట్టవచ్చినట్లు కనపడుతుంది ఈ భేదం.

అయితే ఏం? భారతదేశ, సాంఘిక, రాజకీయ, ఆర్థిక విధానాలలోవలె, భిన్నత్వంలో ఏకత్వం పొసగుతూ

ఉంటుంది. ఈ అనేకత్వంలోని ఏకత్వం శాశ్వతమా అంటే సందేహించకుండా "అవునని" సమాధానం చెప్పలేం.

రోడ్డుమీద రిక్షా ఆగింది.

రిక్షాలోని పెద్దమనిషి క్రిందికి దిగి జేబులో పర్సు తీశాడు. రోడ్డుకు ఈ వైపున ఉన్న గుడిసె బయటి యిసుక దిబ్బమీద పడుకున్న ఆ రేళ్ళ కుర్రవాడు రిక్షాను చూసి గబగబా పరిగెత్తుకుంటూ వచ్చాడు. రిక్షా గంటను గణగణ లాడించాడు. ఏదో అవ్యక్తానందంతో చిందులువేయసాగేడు. అతని మొహంలో సంతోషం విరిసింది.

"అరేయ్, పవిత్రా వెధవ రొద" అంటూ డబ్బులు రిక్షావాని చేతిలో పడేసి ఎదురుగా ఉన్న భవంతిలోకి సాగిపోయాడు పెద్దమనిషి.

ఆ కుర్రవాడు గంట కొట్టటం మానలేదు రిక్షా అతను చిల్లర జేబులో వేసుకుని వాడి వైపు చూశాడు సంబరంతో పొంగిపోతున్నాడతను. రిక్షావాలా సన్నగా నవ్వుకున్నాడు. పరిసరాల్ని పరికించాడు.

గుడిసె ప్రక్కగా నేలమట్టంవరకూ లేచిన పెద్ద భవంతి తాలూకు గోడలు, దాని ప్రక్కనే భవన నిర్మాణానికి అవసరమైన సామగ్రి ఉన్నాయి. ఆ భవనం తయారు కాగానే యీ గుడిసెకి అక్కడ స్థానం ఉండదు. మరోచోట వెలుస్తుంది. అంతేకాని, శాశ్వతంగా ఆ గుడిసె లేకుండా పోవడానికి అవకాశంలేదు.

రిక్షావాలా రిక్షాను వెనక్కు త్రిప్పి ముందుకుసాగాడు. కుర్రాడు రిక్షా వెనుకభాగాన్ని పుచ్చుకుని కొంతదూరం

పరుగెత్తి అలసిపోయి మధ్యలో ఆగిపోయాడు. రిక్షా సినిమా హాలు ముందుకొచ్చి ఆగింది. ఆట వదలటానికి యింకా వ్యవధి వుండటంవలనకాబోలు, రిక్షావాలాలంతా బండ్లలో నడుములు వాల్చి పిచ్చాపాటి మాట్లాడుకుంటున్నారు.

"ఏరా, రాఘవులూ, యేమాత్రం తోలావ్, యియ్యాల?" అప్పుడే వచ్చిన రిక్షావాలాను మరో అతను ప్రశ్నించాడు.

రాఘవులు అన్యమనస్కంగా ఉన్నాడు. అతనికి సమాధానం చెప్పకుండా రిక్షా సీటును ఎత్తి లోపలి అరలో నుంచీ పుస్తకాన్నొకదాన్ని బయటికి తీసుకున్నాడు. రిక్షాలో కూర్చుని దాన్ని చూడసాగేడు.

"ఏందిరా నీ అది. పిలుస్తుంటే పలుకవేం? నిన్నేరా రాఘవులూ" మళ్ళీ హెచ్చరించాడతను.

"ఏందిరా ఎధవగోల. ఆడెంత సంపాయిస్తే నీకేరా, రంగా" యింకొకతను విసుక్కున్నాడు.

రంగడు అతనివైపు తీక్షణంగా చూసి, "పానకంలో పుడకలా మద్దెలో నీకెందుకు?" అన్నాడు కోపంగా. రంగణ్ణి విసుక్కున్నాతను ఏదో గొణుక్కుంటూ రిక్షా ముందుకు లాక్కుని వెళ్ళిపోయాడు.

"ఏరా రాఘవులూ, అంత యిదిగా చూస్తున్నావే ఏఁవన్నా బొమ్మా!" అని "ఇహిహి" అంటూ నవ్వాడు రంగడు.

రాఘవులు పుస్తకాన్ని ప్రక్కకు తీసి రంగణ్ణి చూశాడు. రంగడి వెకిలి నవ్వుకు అతనికి ఒళ్లు మండింది

"వెధవ చేష్టలూ నువ్వూను... నేనెంత సంపాయిస్తే నీ కెందుకురా? ఎప్పుడూ ఎవడో ఓడినెత్తిన చెయి పెట్టటానికి ప్లాన్ వేస్తూనే ఉంటావ్."

రంగడు మొహం చిన్నపుచ్చుకుని, ప్రాధేయపడ్డాడు. "అదిగాదు రాఘవులూ, మా అయ్యకు వంట్లో బాగా లేదురా! ఇయ్యాల రూపాయన్నా మిగల్లేదు. మందెత్తుకు పోవాల్రా. ఓ రెండు రూపాయలుంటే యియ్యి. రేపు చూసుకుందాం. అమ్మా అయ్యా లేనివాడివి, నువ్వుకాక యింకోడెవడు అప్పు పెడతాడురా నాకు... నువ్వే రచ్చించాలి."

రాఘవులు సందేహంగా రంగణ్ణి చూశాడు. ఇలాంటి అబద్ధాలాడటంలో రంగడిది పెద్ద తెలివి! కాని, అయ్య మాటనేసరికి, రాఘవులు ఆలోచన తన తండ్రిమీదకు మరలింది. అతని కళ్ళలో నీళ్ళు తిరిగినై.

అది గమనించి రంగడు. "ఏందిరా ఏడుస్తుండావ్?" అన్నాడు.

రాఘవులు కళ్ళు తుడుచుకుని చెప్పాడు, "రేపణ్ణుంచి మా నాన్నా వస్తాడురా. బాకుగడబ్బులు సరిపోతవో లేదోనని భయంగా ఉంది. సర్లే. రేపటిసంగతి రేపు చూసుకుందాం. ఇవిగో డబ్బులు. రేపు తప్పకుండా యిచ్చేయ్." అంటూ జేబులో నుంచీ రెండు రూపాయ నోట్లు తీసి రంగడిచేతిలో పెట్టాడు. రంగడి కళ్ళు సంతృప్తితో మిలమిల లాడినై. హుషారుగా యీల వేసుకుంటూ రిక్షా తీసుకుని వెళ్ళిపోయాడు.

రాఘవులు మళ్ళీ పుస్తకం తీసి చూశాడు. అదొక చిన్న నోట్ బుక్. దానినిండా జమా ఖర్చుల అంకెలు చిందర వందరగా వేసివున్నై. పుస్తకం మధ్యపేజీలో పెద్ద అంకెల్లో రేపటి తారీఖు వేయబడి ఉంది. దాన్నిచూస్తూ ఏదో ఆలోచనలో మునిగిపోయాడు రాఘవులు.

*　　　*　　　*

రాత్రి పదిగంటలు దాటితే ప్లీడరు రాజశేఖరం గారింట్లో పిట్టా - పురుగు కూడా మేలుకుని ఉండటానికి వీలు లేదు. ఇది ఆయన కఠిన శాసనం. వంటింట్లో కాపురముండే వంటావిడ దగ్గర్నుంచీ, పెరట్లో ఓ మూల కాపురముండే తోటమాలివరకూ అందరూ ఈ శాసనానికి బద్ధులైనవారే. ఇక ఆయన సంతానం—నలుగురి పిల్లలసంగతీ చెప్పనక్కర్లేదు. ఎంత పరీక్ష రోజులైనాసరే, ఎంత చదువుకోవలసిన అవసరం ఉన్నాసరే—ఆసమయందాటి మేలుకొని ఉండరు. అందుకనే రాత్రి పదిగంటలు కాగానే ఆ భవంతిలోని అన్ని గదుల్లోని లైట్లు ఆర్పివేయబడతాయి. అలాంటిది ఈ రోజు ఆ ఇంటి రెండవ అంతస్తులోని ఓ మూలగదిలో లైటు వెలుగుతూ ఉంది—రాత్రి పదకొండు గంటలు కావస్తున్నా కూడా!

రాజశేఖరం గదిలో పట్టెమంచం మీదపడుకుని ఏదో ఆలోచిస్తున్నాడు. మంచానికి ప్రక్కనే కుర్చీలో ఆయన భార్య కాంతం కూర్చుని ఉంది.

చేతిలో వుత్తరాన్ని అటూ యిటూ త్రిప్పుతూ భర్త కళ్ళల్లోకి చూస్తూ అందామె, "అయితే యీ సంబంధమూ తప్పిపోయినట్లేనన్న మాట. అమ్మాయిని ఎంతమంది వచ్చి చూసి వెళ్తున్నా, ఒక్క సంబంధమూ కుదరకపోవటానికి మీ వాళ్ళ ప్రవర్తనే ముఖ్యకారణం. ప్రతివాళ్ళూ మొరికనే ఎంచుతుండిరి. లేకపోతే మనకామేశ్వరికేం తక్కువ. చదువు, అందం అన్నీ వుండికూడా దాని ఖర్మ లా కాలింది. ఇక ఈ జన్మలో దానికి పెళ్ళవుతుందనే ఆశ నాకేఁవీ కనపడటం లేదు."

రాజశేఖరం ఆమెవైపు సాలోచనగా చూశాడు. భార్య మాటలు ఆయన మనస్సుకు కష్టం కలిగించినై. దీర్ఘంగా నిట్టూర్చి అన్నాడు. "గతించిపోయిన సంఘటనలకు ప్రాముఖ్యాన్నిచ్చి, రంధ్రాన్వేషణ చేసి తప్పులెన్నాలనుకుంటే ఎవరిలోనైనా దొరుకుతాయ్. అంతా మనుషులమేగాని దేవుళ్ళం కాముగదా. అలా జరగాలని రాసిపెట్టి వుంది, జరిగిపోయినై. అందుకే ఒక్క విషయానికి నాకు విచారంగా వుంది. ఈ రోజుల్లో కూడా పూర్వంలోలా యివన్నీ చూస్తున్నారంటే మనమెంత అభివృద్ధి చెందామో అర్థమవుతుంది."

"సరేలెండి. మీరనేది మరీ బాగుంది. మనవాళ్ళు బుద్ధులలా తగలడటంలో తప్పు లేదుకానీ, ఊళ్ళోవాళ్ళు వాటిని ద్వేషిస్తున్నారంటే విచారమెందుకు? పోయేవాళ్ళు పోక యీ అప్రతిష్ఠలన్నీ మన నెత్తిన పడేసిపోయారు." కాంతం కొంచెం తీవ్ర స్వరంలో విసుగ్గా అంది.

రాజశేఖరం ఏమీ మాట్లాడలేకపోయాడు. అతని హృదయంలో సంచలనం రేగింది. గత జీవిత విషాదరేఖలు అతని కళ్ళకు గోచరించినై. తండ్రి, పినతల్లి చేసిన నేరాలు తన జీవితాలమీద ఎలాంటి చెరగని ముద్రవేసిందీ, అవగతమై మనసు బాధపడింది. కామేశ్వరికి పెళ్ళికి ఆర్థికపు టిబ్బందులుగాని, ఆమె అందచందాలుగానీ ఏవీ ఆటంకం కావటం లేదు. వున్న పెద్ద అవరోధం ఇదొక్కటే—తను వంశం మంచిది కాదనేది!

ఆ విషయంలో తామెంత మెలుకువగా వ్యవహరిస్తున్నా అది బయటికి పొక్కుతూనే వుంది. వచ్చిన వాళ్ళంతా ఆ వంక చూసి వెళుతూనే వున్నారు. రాజశేఖరంకు భార్య మాటలే నిజమౌతాయేమోననే భయం కలిగింది.నిజంగానే కామేశ్వరి కీ జన్మలో పెళ్ళికాదేమోననే సందేహం మొట్టమొదటిసారిగా ఆయన మనస్సులో ప్రవేశించింది. ఈసమస్యను పరిష్కరించటానికి ఏదారీ తోచటం లేదు.

నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ అంది కాంతం, "వున్నదుండగా వుపాకర్మ అన్నట్లు, అజ్ఞాతంగా వుంటేనే యిట్లా వుండి దరిదాని తోచక చస్తుంటే, రేపు మీ నాన్నగారు బయటికొస్తారు. గుర్తుందిగా. ఇహ, మనమ్మాయి పెళ్ళి మాటల్లో తప్ప చేతల్లో జరగదు"

రాజశేఖరానికి రేపటి రోజు ప్రాముఖ్యత గుర్తుకొచ్చింది. రేపు తన తండ్రి విడుదలై బహిః ప్రపంచంలోకి వస్తాడు. సరాసరి తనవద్దకే వస్తే—......

రాజశేఖరం కలవరపడ్డాడు. కాంతం చెప్పినట్లు నేరస్థులు కనపడనప్పుడే తమను వ్రేలెట్టి చూపి పరిహాసిస్తున్న సంఘం—ఆ నేరస్థులు ప్రత్యక్షంగా కనపడుతుంటే సహించదు. బహిరంగంగా విమర్శిస్తుంది. అపహాసిస్తుంది. అంతే కాదు, తమనుంచీ బహిష్కరించవచ్చు.

'అబ్బ.' రాజశేఖరం రెండు చేతుల్తో తల పట్టుకుని వెనక్కి వాలిపోయాడు.

కాంతం భర్తను చూసి కలవరపడింది. ఆయన ప్రక్కన కూర్చుంటూ చెప్పింది. "ఎంత తల బ్రద్దలు కొట్టుకుని మాత్రం ప్రయోజన మేమిటి? జరిగిందేదో జరిగింది. కానీ, రేపు ప్రొద్దున్నే ఆయనగార్ని ఇక్కడికి తోలుకు రాకండి. చేచేతులా ఈమాత్రపు ప్రశాంతినికూడా లేకుండా చేసుకోకండి. ఏఁవంటారు?"

రాజశేఖరం సమాధానం చెప్పలేకపోయాడు. భార్య ఆలోచనని గర్హించాలో, ఆమె ముందు చూపుకు గర్వించాలో తెలియ లే దాయనకు. భార్య కళ్ళల్లోకి చూస్తూ ఉండిపోయాడు.

*   *   *

ఠాణాలో పన్నెండు గంటలు కొట్టారు.

ఉసూరుమంటూ కంబళిమీద అప్పటి వరకూ పొర్లాడిన శంకరయ్య లేచి కూర్చున్నాడు. పున్నమిచంద్రుని కాంతి కిరణాలు వెంటిలేటరుగుండా గదిలో ఓమూల పరుచుకున్నై. విషాదావృతమైన శంకరయ్య హృదయంలో ఓ మూల వెలుగు విరిసింది. గదిలోని వెలుగు చీకట్లతో పోటీ

చేస్తూ శంకరయ్య మనస్సులో సంతోష విషాదాల సంచలనం రేగింది.

ఇరవై సంవత్సరాలు!

అనంతమైన కాల ప్రవాహంలో ఇరవైఏళ్ళు తృణకణాలు కావచ్చునేమో కాని, అరవై అయిదేళ్ళ తన జీవితంలో అవి మరపురాని మహత్తర సంవత్సరాలు. గడిచిన ఇరవై ఏళ్ళనుంచీ చీకటికొట్లో బందీగా గడచింది తన జీవితం.

పచ్చని చేలు—పండు వెన్నెల, ప్రాణికోటి—ప్రకృతి సౌందర్యాలను చూసి పులకించే తరుణం మళ్ళీ ఇంతకాలానికి లభించింది. ! బహిః ప్రపంచంలో, స్వేచ్ఛా వాతావరణంలో పక్షిగా విహరించే మహద్భాగ్యం మళ్ళీ తన బ్రతుకుకు లేదనే తలచాడు తను. కాని—భగవంతుడు తాను నిర్దయామయుడిని కానని ఋజువు చేసుకున్నాడు! తనకు వెలుగు చూపబోతున్నాడు.

ఆనందం ముప్పిరిగొని ఉప్పొంగిపోతున్న శంకరయ్య హృదయం అంతలోనే క్రుంగింది. నేరస్థుడిగా లోకానికి రోసి కఠిన నరకానికి గురిచేయబడిన తను బయటికి పోయి సాధించే దేమిటనే ప్రశ్న ఎదురైంది. అవును. తాను పొందబోయే సౌఖ్యం కాని, లాభం కాని ఏమిటి? అయిన వారికి కాని, పరాయివాళ్ళకు కాని తానెలా ఉపయోగపడగలడు?—లేనప్పుడు వారికి భారమే గదా?

అయినవారి ఆలోచన రాగానే శంకరయ్య మనస్సు

గతంలోకి గెంతింది. కళ్లు మూసుకుని మళ్ళీ నేలమీదికి ఒరిగాడు.

పదేళ్లపాటు కాపురంచేసి, ఎనిమిదేళ్ళ పిల్లవాణ్ని పెంచి పెద్దచేసి భారాన్ని తన భుజస్కంధాలమోపి, కామేశ్వరి హఠాత్తుగా యీ లోకాన్ని వీడిననాడు తన హృదయ వీణా తంత్రులు పెటపెటమని తెగిపోయినై. ప్రపంచమంతా చీకటి మయంగానే కనిపించింది. 'అమ్మేది నాన్నా' అని తల్లడిల్లిపోయే శేఖరాన్ని సముదాయించలేక గుండెలు పిండి నట్లయ్యేది తనకు. స్కూల్లో కో టీచర్స్ బలవంతంవల్లనైతేనేమి, ఊళ్ళో శ్రేయోభిలాషుల సలహాలకు లొంగయితే నేమి తాను సుమతిని పెళ్ళాడాడు. ఆమె తన హృదయ వీణాతంత్రుల్ని సరిచేసి, బిగించి, పూర్వవీణాగానా న్నాలపించి తనను మధురగాన ఝురిలో ముంచి తేలుస్తుందని ఎన్నెన్నో ఊహించాడు. కాని, ఆశాభంగమే లభించింది తనకు.

ఆరోజు—

సుమతికి ప్రథమ సమాగమం!—

కాలి అందెల రవళికి, దినపత్రికను మూసి తలెత్తి చూశాడు తను.

అదే సందడి!—కామేశ్వరి కంకణ నిక్వాణానికీ, సుమతి మంజీర శింజితానికీ భేదం గోచరించలేదు తనకు. అయినా తా నావేళ సుమతిచే సమ్మోహితుడు కాలేకపోయాడు.

కారణం?—తనకది ప్రథమ సమాగమం కాకపోవటం.

మనస్సును కాదని ఎంత మరలించినా, కామేశ్వరితో తన సాహచర్య మధురోహల్ని తన కళ్ళముందు నుంచి పార ద్రోలలేకపోయాడు. 'పోనీ సుమతి అందచందాలైనా తన మనస్సును తట్టి లేపేయా' అంటే అదీ లేదు. సుమతి అంతటి భాగ్యశాలీ కాదు. అలాగని అనాకారీ కాదు. అసలు జీవితంలో ఏ అనుభూతి అయినా పునరావృత్తమైతే తొలిసారి కలిగే హృదయస్పందన కాని, పొందే ఆనందపు పొంగు కాని మలిసారి లభించదు.

పర్యవసానం ?—సుమతి కన్నీళ్లు.

తన ప్రవర్తన వలన ఆమెకు తానంటే ఒక విధమైన అలక్ష్యం ప్రబలింది. మాటల్లో చేతల్లో ఈసడింపు గోచరించేది.

ఋతువుల్లో వసంతం, వసంతంలో మధుమాసం, మధుమాసంలో పున్నమిరేయి, పున్నమిరేయిని ఆమని కోయిల గానం—ఆ ఆహ్లాదకర వాతావరణంలో ప్రియా సమాగమ లబ్ధమైన సమ్మోదం, కలకాలం కాంతల మనసుల్ని కరగించే యిలాంటి వేడుకను సుమతికి తాను తీర్చ లేకపోయాడు. ఇప్పుడనిపిస్తున్నది, తానామెకా విధంగా అన్యాయమే చేశానని. ఎంతసేపటికీ శేఖరం భవిష్యత్తుమీద నిమగ్నమై ఉండేది తన మనస్సు. సుమతికి తన భవిష్యజ్జీవితాన్ని గురించిన ఆరాటం ప్రబలిపోతూ ఉండేది. దాన్ని తాను గమనించి కూడా నిర్లక్ష్యం చేశాడు. తన నిర్లక్ష్యానికి ప్రోద్బలమైన మరో కారణం, రఘు జననం. సుమతి కడుపు పండి బిడ్డడిని కనటమే ఆమె జీవితానికి మహాద్భా

గ్యంగా తలచేదు తను. కాని, సుమతి మనస్సు కేవలం మాతృత్వాన్ని పొందటంతో తృప్తిపడలేదు. తన వయసును తరింపచేసుకుని, గుండెల్లో ఆనందం పండించుకోవాలనే కాంక్ష ఆమె కుండేది.

ఈవిధంగా కొన్ని రోజులు గడచినై.

తానంటే ఈసడింపే కాకుండా, శేఖరమంటే ఈర్ష్య కూడా ఆమెలో విజృంభించింది. చీటికి మాటికి తిడుతూనో, కొడుతూనో వాణ్ణి వేధించసాగింది. వస్తుతహా మెతక స్వభావం కలిగిన శేఖరం సవతి తల్లి పెట్టే బాధల్ని వేటినీ తన దాకా చేరవేయకపోయినా, శేఖరమంటే సుమతి చూపుతున్న సవతితల్లి ప్రేమను తాను గమనించకపోలేదు. గమనించినా, పైకి ఆమె నేమీ అనగలిగేవాడు కాదు.

చుట్టపు చూపుగా వచ్చిన శేఖరం అమ్మమ్మ, వాడి పట్ల సుమతి ప్రవర్తనను కళ్లారా చూసి వాణ్ణి తనతో తీసుకు పోతానంది. తానూ అదే మంచిదని భావించాడు. సుమతి 'వాడికి నే నిక్కడేం తక్కువ చేస్తున్నా' నని మొదట్లో కొంచెం రాద్ధాంతం చేసినా వాణ్ణి పంపటానికి సుముఖతచూపింది.

శేఖరం మేనమామ ఇంటికి వెళ్ళిపోయాడు. వాడి కంటే తనకు బెంగ ఎక్కువైంది. కాని, ఆ బెంగ ఎంతో కాలం నిలవలేదు కాలక్రమేణా శేఖరానికి మేనమామ చదువు సంధ్యలు నేర్పటం, పద్ధెనిమిదో ఏటే తన కూతుర్నిచ్చి పెళ్ళి చేయటం జరిగిపోయినై. శేఖరం వెళ్ళిన తర్వాత సుమతి ప్రవర్తనలో యింకా మార్పు వచ్చింది

ఠాణాలో ఒక గంట కొట్టారు. శంకరయ్య కళ్ళు నులుచుకున్నాడు. కళ్ళు మండుతూ నీళ్లు కారుతున్నై. ప్రక్క కొట్లో ఖైదీ పిచ్చి ముసలయ్య ఏవో అరుస్తున్నాడు. బూతులు తిడుతున్నాడు ఎవర్నో. అతనూ తనలాగా 'దగా పడిన తమ్ముడే,' హత్యా నేరానికి శిక్ష ననుభవిస్తున్నాడు. ఏంవిటో ఈ జీవిత మనిపించింది శంకరయ్యకు. 'మిథ్య' అని సమాధానం చెప్పుకునేసరికి సన్నగా నవ్వొచ్చింది. నేరస్థునిలో పశ్చాత్తాపం, మానసిక పరివర్తన—ఈ రెండూ జైలుశిక్ష విధించటంలో అధికారి ఆశించే పరిణామాలు. కాని, ఎందరిలో ఈ మార్పు కలుగుతోంది?—ఏమో?

శంకరయ్యకు నిద్ర రావటంలేదు. పూర్వాశ్రమం లోని తన జీవితమంతా నెమరుకువచ్చి మనసును కలత పరుస్తుంటే నిద్రేం పడుతుంది?—ప్రక్కకు తిరిగేడు. జైలు గోడమీద పాతబడిన చలనచిత్రం మసక మసకగా కనపడ సాగింది.

క్లాసులో పాఠం పూర్తిచేసుకుని టీచర్సు రూమ్‌లోకి వచ్చాడు తను. గది ద్వారం దగ్గరికి చేరేసరికి తనను గురించిన సంభాషణ వినపడి అలాగే నిలబడిపోయాడు. కృష్ణమూర్తి— రామ్మూర్తీ సన్నగా మాట్లాడుకుంటున్నారు.

"శంకరయ్యగారి పెళ్ళాం పెద్ద నాయకురాలైందిట గదండీ?"—!!

తన కడుపులో దేవినట్లయింది

"ఆఁ...కాక ఏం చేస్తుందండీ. ఈయ నొక పెద్ద విశాల హృదయుడు. ఆమెకు కావలసిన స్వేచ్ఛ నిచ్చాడు

కాని, ఆనందాన్నివ్వలేదు. దాన్ని పొందే మార్గాన్ని తెలుసుకుందావిడ. అంతే."

తన హృదయం వ్రయ్యలైంది. మండే గుండెతో కొంపకు చేరాడు. సుమతిని రకరకాల ప్రశ్నలు వేశాడు. ఆమెమీద అనుమానపు దృక్కులను బరపాడు. తన హృదయంలోని శాధనంతా త్రవ్వి ఆమెముందు కుప్పగాపోశాడు.

సుమతి కళవళపడింది ఏమీ సమాధానం చెప్పలేక పోయింది. దెబ్బ తిన్నదానిలా అయిపోయి అంతలోనే తేరుకుంది. పొడినవ్వు నవ్వి తన దగ్గర చేరింది. చుబుకాన్నెత్తి, తన కళ్ళల్లో కళ్ళు పెట్టి "మీ రెంత అమాయకులండీ. ఎందు కంత తికమక పడతార" ని ప్రశ్నించింది.

తా నేమీ చేయలేకపోయాడు. ఆమె చంచల నేత్రాల్లో చంచలత్వాన్ని చపలత్వాన్నీ పసికట్టలేకపోయాడు. కాగా, రగిలిపోతున్న తన హృదయానికి అమృతపు చిలకరింపులైనాయామె పలుకులు. ఏమైనా తనలో అనుమాన బీజాలు నాటుకున్నాయి. మనస్సులో ఆరాటం మొదలైంది. ఎవరితో కలిసి తిరుగుదామన్నా ఏదో లజ్జ ముంచుకొచ్చేది. తన నెవరు చూస్తున్నా ఏదో చులకనచూపు చూస్తున్నా రని పిస్తూ ఉండేది. ఇద్దరం కలిసి మాట్లాడుకుంటూంటే తనను గురించేననే భావన కలుగుతూ ఉండేది. ఆవిధంగా తనకు తానుగా పదిమందికీ దూరమై పోయాడు.

ఒకసారి తా నేదో పనిమీద పట్నానికి పోయి, మర్నాడు ఊరుకు చేరుకునేసరికి ఊరు ఊరంతా గుప్పుమంది. ఇద్దరు వ్యక్తులు కలిసినచోటల్లా సుమతి మాట వినపడింది. ఏటి ఒడ్డున అమ్మలక్కల దగ్గర్నుంచీ, తన యింటి

ప్రక్క చిల్లరకొట్టు, శేషావతారం వరకూ—అంతా ఇదే విషయాన్ని ఓలవలు పలవలుగా చెప్పుకొని ఆనందిస్తున్నారు. తనను చూసి వచ్చే నవ్వును ఆపుకుంటూ బాధపడ్డారు.

తల కొట్టేసినట్లయింది తనకు. ఇంటికిపోయి కోపంతో సుమతిని నానా హింస పెట్టాడు. కాని, సుమతి తాను నిర్దోషినని వగలుపోయింది. నిజా నిజాల్ని తా నెంతగానో ఆలోచించి చివరికి నిప్పులేని పొగ రాజుకోదనే నిశ్చయాని కొచ్చాడు.

ఆనాటినుంచీ తన జీవితం నిప్పులు చెరిగింది. ఇల్లొక నరకకూపంగా మారిపోయింది. సుమతికీ, తనకూ మాటా మంతీ లేకుండా పోయాయి.

ఒకరోజున టీచర్సు రూములో తా నేదో ఆలోచించు కుంటూ కూర్చున్నాడు. హిందీ మాష్టరు పూర్ణానందం మాసపత్రిక నొకదాన్ని తెచ్చి "ఈ కథ చాలా గొప్పగా ఉందండీ. చదవడం" టూ పుస్తకాన్ని తనచేతి కిచ్చాడు. ఆయనంటే తనకుగల సదభిప్రాయం తానా కథను చదివే టట్లు చేసింది.

తీరా చదివితే – ఆ కథకూ తన జీవితానికీ పోలికలు గోచరించినై. అందులోని పాత్రలు, వాటి మన స్తత్వాలు తను కన్వయించుకుంటే అతికినట్లు సరిపోయినై.

అందులో ఒక భర్త అసమర్థత కారణంగా భార్య పతితగా మారుతుంది. ఆమె చాలా విద్యా సంపన్నురాలు. కవయిత్రి. సంఘంలో మంచి గౌరవస్థానంలో ఉండి కూడా సమాజంలో విచ్చలవిడిగా సంచరిస్తూ ఉంటుంది. ఆమె

నైచ్యాన్ని చూస్తూచూస్తూ కూడా సహించి వూరుకుం టాడు భర్త. పైగా ఆమె ప్రవర్తనను తనలో తానుగా సమర్థించుకుంటాడు. కాని, లోలోపల కృశించిపోతూ ఉంటాడు. ఆ బాధతో క్రుంగి రోగంతో తీసుకుపోతాడు.

హృదయాన్ని కదలించే కథ. కాని, భర్త పాత్ర పోషణలో అవాస్తవికత చోటు చేసుకుందనిపించింది తనకు. ఏ భర్తా అంతటి సాహసశీలిగా ఉండలేడని భావించాడు.

పూర్ణానందం ఆ కథను చదవమని తన కెందు కిచ్చాడో అర్థమైంది తనకు. ఇలాంటి హేళనల కెన్నింటికో తన కడుపు రగిలిపోయింది.

సుమతి చరిత్రలో తర్వాత అధ్యాయం క్రొత్త సరి గామాన్ని తెచ్చిపెట్టింది. ఊళ్ళో కొందరి పేర్లతో 'సుమతి' పేరు జతచేయబడింది. ప్లీడరు వీరాస్వామి, మునసబు కొడుకు గోపయ్య పేర్లు అలాంటి వాటిలో కొన్ని. తనకు జీవితమంటేనే రోత పుట్టింది. ఆ విషపూరితవాతావరణంలో, ఆ నరకంలో బ్రతకలేననిపించింది. మనుష్య సంచారంలేని ఏ సుదూర తీరాలకో పారిపోవాలనిపించేది. కాని, సుమతి జాలిచూపుల కన్నీటిధారలు తన ముందరి కాళ్ళకు బంధం వేసినై. ఆమె అమాయకంగా చూస్తూ "దేవుడులాంటి మీకు అబద్ధం చెప్తానా?" అంటే నీళ్ళు కారేవాడు తను. అంతలోనే లోకుల మాటలకు బాధతో హృదయం కలత చెందేది. కామేశ్వరి సుగుణ సంపదను, ఆమెతో తను గడిపిన మధుర క్షణాల్ని గుర్తు చేసుకుని, వాటినిసుమతితో పోల్చుకుని మనస్సు వ్యథ చెందేది. హృదయంలో బడబా గ్నుల్ని, అగ్ని పర్వతాల్ని దాచుకొని రోజులు వెళ్ళ

బుచ్చాడు. ఆ బడబాగ్నులు భయంకరంగా ఎగసి, ఆ విష జ్వాలలు తనను దహించివేసిన రోజు, ఆ అగ్నిపర్వతాలు బ్రద్దలై తనను తుత్తునియలు చేసిన దుర్దినం–అదే ఆరోజు!–

ఠాణాలో మూడు గంటలు మ్రోగినై. శంకరయ్య గుండెలమీద సమ్మెటపోటు లైనాయా గంటలు.

ఆ రోజున తా నెలా మరువగలడు?

స్కూల్లో మీటింగుకు హాజరై, బజారుపని చూసుకుని తాను ఇంటికి చేరేసరికి రాత్రి తొమ్మిది గంటలైంది. పరధ్యానంగా తలుపు తట్టబోయిన తను లోపలి గుసగుసల్ని విని ఆ ప్రయత్నం నుంచీ ఆగాడు. లోపల ఏవో కిలకిలలు, పకపకలు!—

క్షణంలో సగకాలం, ఒక లిప్తలో సహస్రాంశం సేపు గుండె కొట్టుకోవటం మానేసింది. కాలు వెనుకడుగు వేసింది. కాని, అప్రయత్నంగా తలుపును దడదడ లాడించింది తన చెయ్యి. లోపలి వ్యక్తులు తికమక పడ్డారు. కలవరంతో తలుపు తీసిన సుమతి తనను చూసి దిగ్భ్రమ చెందింది. నేరస్థురాలిలా కంపించిపోయింది. ఈ హఠాత్సంఘటనకు తప్పుకుపోయే మార్గంలేక బిత్తరిచూపులు చూస్తూ గదిలో ఓ మూల ముడుచుకు నిలబడ్డాడు — టైలర్ వీరాస్వామి!

అసంభవమూ, ఊహాతీతమూ అనుకున్న సంఘటన సంభవిస్తే కలిగే ఆశ్చర్యం, ఆవేశంకూడా ఊహాతీతంగానే ఉంటాయి. తన పెదవులు బిగపడి పళ్లు పటపటలాడినై. కళ్లు నిప్పులు క్రక్కినై. బరితెగించిపోయిన కాముకుల్ని చూసి తనకేదో పిచ్చి ఆవేశం ఆవరించింది. టేబుల్‌మీద ఉన్న

కాలర్‌ని తీసుకుని 'ఛా' అంటూ ఒకేఒక్క వేటు...!

"అబ్బా" అంటూ కూలిపోయాడు వీరాస్వామి. తాను భయంతో నిలువెల్ల వణికిపోయాడు. ఈగందరగోళా నికి నలుగురూ చేరారు. తనకు కళ్లు తిరిగినట్లు కావటం,తల పట్టుకు క్రింద కూలిపోవటం వరకే తనకు తెలుసు.

స్పృహ వచ్చి చూసేసరికి పోలీసుల ఎదుట పడు న్నాడు తను. తాను వేసిన కాలర్ తగలరాని చోట తగిలి వీరాస్వామి మరణించాడని తర్వాత తెలిసింది. తాను హంతకుడుగా నిరూపింపబడ్డాడు. యావజ్జీవ కారాగారశిక్ష విధించారు తనకు.

చివరిసారితననుచూస్తూగుడ్లనీరు గుడ్లకుక్కుకుందిసుమతి. తన కామెవైపు చూడటానికి అసహ్యం వేసింది. 'నాన్నా —నాన్నా' అంటూ రోదించాడు రఘు. వాణ్ణి చూసి తన కడుపు తరుక్కుపోయింది. శేఖరం కాంతంతో సహా తనను చూడటానికి వచ్చాడు. శేఖరం కళ్ళల్లో తానా నాడు ఎన్నెన్నో చదివాడు. తను రెండో పెళ్ళి చేసుకున్నందుకే వాడికి కొంత బాధ ఉన్నట్లు తెలుసు తనకు. అలాంటిది పినతల్లి ఇంత నీచానికి ఒడిగట్టటం, తండ్రి ఒక హంత కుడుగా మారటం శేఖరం మనస్సును కలచివేసి ఉంటై. అందుకనీ అతనిలో తానంటే ఏదో ఏహ్యాభావం గోచరిం చింది. కడసారి తనను పలకరిస్తూ అదే అన్నాడు. "ఎలాంటి వాళ్ళం చివరికి ఎంత దుస్థితికి దిగజారేం, నాన్నా" అంటూ కళ్లనీళ్ళు పెట్టుకున్న శేఖరం తన కళ్ళముందు నిలుస్తు న్నాడు. ఏమైనా తానంటే అసహ్యమే వాడికి. ఆ విధంగా చీకట్లోకి వచ్చేశాడు తను, చిత్రం ముగిసింది.

గాలికి ఎగిరివచ్చి తన ప్రక్కన పడిన జీర్ణపుటాన్ని చదివినట్లయింది శంకరయ్యకు. తన జీవన గ్రంథంలో నలిగిన పేజీ అది.

ఠాణాలో గంటలు మ్రోగుతున్నై. ఖైదీలు విశ్రాంతి చాలించే వేళయింది. జైలు వరండాల్లో కాపుదార్ల కేకలు ప్రతిధ్వనిస్తున్నాయి.

శేఖరానికి తనమీది ఏహ్యాభావం ఇప్పుడు మాసిపోయిందో లేదో మరి? రఘు ఎంతవాడైనాడో? ఏం చేస్తున్నాడో ? ఈ రోజు శేఖరం, రఘు—ఇద్దరూ తననుతీసుకుపోవటానికి వస్తారు కాబోలు. సుమతి ఏమైందో?

శంకరయ్య ఆలోచించలేకపోయాడు. బరువుగా కళ్ళు మూసుకున్నాడు. నులివేడి కన్నీరు కణతల్ని తడిపింది. చేతి చూపుడు వ్రేలితో అశ్రుకణాల్ని తుడుచుకుంటూ లేచి కూర్చున్నాడు. ఒళ్ళంతా విరకొట్టినట్లుంది. ఏదో బధకం దాన్ని పారద్రోలుతూ ఏదో ఉత్సాహం. ఆ ఉత్సాహాన్ని వెలుపలికి రానీకుండా భయం. ఆ భయాన్ని పెరుగనీయని నిర్లిప్తత. అనేక రకాలైన శారీరక, మానసికావస్థలకు లోనై ఊగిపోయాడు శంకరయ్య.

ఖైదీల కోలాహలం హెచ్చింది.

శంకరయ్య లేచి తలుపుదాకా వచ్చాడు. ఊచల్ని పట్టుకుని బయటికి చూడసాగేడు.

కొద్ది సేపటికి ఎవరో వచ్చారు. తలుపుతీసి తమవెంట జైలు సూపర్నెంటు దగ్గరకు తీసుకుపోయారు.

శంకరయ్య దుస్తులు ఆయనకిచ్చి హితబోధచేశారు సూపర్నెంటు. పరితప్త హృదయంతో నూతన జీవితాన్ని

ప్రారంభించి, జన్మ సార్థకం చేసుకోండి. తప్పు చేయటం మానవ సహజం. చేసినతప్పును తిరగిచేయటం రాక్షసత్వం. కనక మళ్ళీ ఏ నేరానికి పూనుకోకండి."

శంకరయ్య ఆయనకు నమస్కరించి ఇవతలకు నడిచాడు.

జైలు బయటికి రాగానే శంకరయ్య చూసిన వ్యక్తి —రిక్షా హేండిల్ మీద ఒరిగి ఆతృతగా గేటువైపు చూస్తున్న రాఘవులు. తన రఘు పోలికల్ని అతనిలో వెతుకుతున్నాడు శంకరయ్య.

నాలుగుకళ్లూ రెండయి ఆనందంతో మిలమిలలాడాయి. 'నాన్నా' అంటూ బావురుమని శంకరయ్య చేతుల్లో వాలిపోయాడు రాఘవులు. పుత్రగాత్ర పరిష్వంగ సుఖంలో పులకించిపోయింది శంకరయ్య హృదయం.

ఆనంద జలధినుంచి బయటపడిన శంకరయ్య చుట్టూ చూసి కొడుకును అడిగాడు "అన్నయ్య రాలేదురా రఘూ అని."

"ప్చ్" అని పెదవి విరిచి, "ఇప్పుడు నాపేరు రాఘవులు నాన్నా" అన్నాడు రాఘవులు, ముందడుగు వేస్తూ.

శంకరయ్య అంతరంగం కలుక్కుమంది. దీర్ఘంగా నిట్టూర్చాడు. ఆయన కంఠంలో ఏదో కొట్టుకులాడింది.

"మీ అమ్మ..." అని ఏదో అడగబోయేడు గానీ, ఆయన గొంతుమూగవోయింది.

ఎదురుగా ఉన్న ఎత్తుపల్లాల రోడ్డు వారికి స్వాగతం పలికింది.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA127B171 |
| పుస్తకం పేరు | సాగరసంగీతం |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 181 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | Bannu |
| స్కాన్ చేసినది | Prathyusha |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |